# పురందర మందారము

## గేయ కవితా కదంబము

సాహితీ సహృదయులు
మధుర మంజుల మార్దవ హృదయులు
శ్రీ [illegible] గారి కరకమలములకు
స[illegible] [illegible]
- శాంతిశ్రీ.
3-1-84.

"శాంతిశ్రీ"

జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

*This book is Published with the financial assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme Aid to Publish Religious books*



ప్రథమ ముద్రణము
వినాయక చతుర్థి
ఆగస్టు 1982
వెల : రూ. 20/-



ప్రతులకు
జంధ్యాల చంద్రశేఖర్
శాంతి సదన్
సుబ్బారావుపేట, తాడేపల్లిగూడెం.



టైటిల్ : అభినందన
ముద్రణ
సర్వోదయ ప్రెస్, విజయవాడ.

సువర్ణస్య సువర్ణస్య
సువర్ణస్యచ మైథిలీ!
రామేణ ప్రేషిత మిదం
సువర్ణస్యాంగుళీయకమ్ !

శ్రేష్ఠతరమగు రంగు కలది శ్రీరామవర్ణముల్ కలది
పది మాషముల ఎత్తు కలది బంగారు ఉంగరం బిదిగో!
మైథిలీ! శ్రీరామవిభుడు మంచిగుర్తుగ పంపినాడు
అంజనా తనయుడను నేను అందించుచున్నాను తల్లి!

# మందార సౌందర్యము

"కరుణశ్రీ"

శ్రీరస్తు! భవ్యకవితా
శ్రీరస్తు! సవిత్రియగు ధరిత్రికి శాంతి
శ్రీరస్తు! కవికి విజయ
శ్రీరస్తు! రసజ్ఞ తతికి శ్రేయోస్తు సదా

సుందరము దాశరథి కథ;
సుందరమగు హనుమలీల; సుందరము మహీ
నందన చరితము; కలిసిన
సుందరమందార మధిక సుందర మగుతన్

నన్నయ్యకు సాగిలపడి
చిన్నయ్య నెరింగి కవితచెప్పంగల మా
అన్నయ్య కొడుకు అంజన
కన్నయ్య చరిత్ర గేయకావ్య మొనర్చెన్

చిక్కని పదబంధమ్ముల,
చక్కని వర్ణనల, సరస సంఘటనములన్,
మిక్కిలి సుందర మీ కృతి
చక్కిలిగిలి నిడుత నవ రసజ్ఞుల మదికిన్!

# కవితా కహ్లార నీరాజనము

"ప్రగతి గీతా ప్రవక్త"
డాక్టరు నండూరి రామకృష్ణమాచార్య

శీలమునందు సౌహృద విశిష్టులు- మార్దవవైఖరీ వచః
శ్రీ లలితుల్- సుధామధుర చిన్మయచిత్తులు తెల్గునేల- జం
ధ్యాల కులోద్భవుల్-వినయ సంభ్రమ వివేక విశేష శేముషీ
శాలురు-శుద్ధసాత్త్విక యశస్వులు- సౌమ్యులజాత శాస్త్రవుల్

వెన్నమృదుత్వమున్- తరపి వెన్నెల చల్లదనమ్ము పల్కులన్;
క్రొన్నన తావి తేనె పెరగుండెల విశ్వజనీన సత్త్వ సం
పన్నతగల్గి-స్వాదుమృదు మానసమొప్పగ-నాల్గుదిక్కులన్
జన్నిద మింటిపేరు వెదజల్లును మంచితనంపు వెల్గులన్

అట్టి జంధ్యాల వంశాన అవతరించె
వేంకటేశ్వరశాస్త్రి కవి ప్రవరుడు!
సిద్ధహస్తుడాతడు పద్యశిల్పమందు
హృద్య సుందర మందార కృతిని వ్రాసె

స్వాంతంబం దతిలోకమా వెలుగుతో- సౌశీల్య సంపత్తితో-
శాంతారత్నము సుబ్బలక్ష్మి గృహిణీ కల్యాణి-సేవింప-సత్
సంతానాభ్యుదయ ప్రఫుల్ల సుమనస్ సౌరభ్య సంతుష్టితో-
"శాంతిశ్రీ" కవి జీవయాత్ర నెరపున్ సాహిత్య తేజస్వియై

సుందర కృతి మందారమ్
నందనోద్యాన సుందరమ్
శాంతిశ్రీ కంకణమ్ భజే
వేంకటేశ్వర శాస్త్రిణమ్.

# శుభాకాంక్ష

ఉషశ్రీ
ఆకాశవాణి

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్!

రామకథను వాల్మీకి కోకిల పాత్యైగేయేచ మధురంగా యిచ్చిన నాటినుండి నేటివరకూ ఎందరెందరో ఆ గాధను తమగొంతుతో విని పించడానికి యత్నిస్తూనే ఉన్నారు. అటువంటి అమృత మధుర జీవ గాధను సంపూర్ణంగా ఆకర్ణించి ఆలకింపజేసేవారు కొందరుకాగా—

రామాయణ జీవధాతువుగా "సుందరకాండ" మాత్రమే స్వీకరించి మళ్ళీమళ్ళీ తమభాషలో, తమగొంతుతో వినిపించి తరిస్తు న్నారు. ఈ కృతికూడా అటువంటిదే.

వాల్మీకి శ్లోకాలలోని శబ్దసౌందర్య, మాధుర్యాలకు ముచ్చట పడిన జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రిగారు ఆ మాధుర్యాన్ని ఎడనెడ అందిస్తూ కవిఋణం తీర్చుకున్నారు.

మరల నిదేల రామాయణం బన్న? ప్రశ్నకు కవిసమ్రాట్ కల్పవృక్ష విశ్వనాథులిచ్చిన సమాధానం ఉండనే ఉంది.

నా భక్తి రచనలు నావిగాన
తలచిన రామునే తలచెద -

ఆ ఊపుతోనే యీ శతాబ్దంలోకూడా ఎందరో అందుకున్న రామ కథను "సుందార మందారం" చేసి యిచ్చిన జంధ్యాల వారి కృషిని రామభక్తులు, హనుమదారాధకులు అందుకుంటారని ఆకాంక్ష!

# సుందర సమాలోచనము

సామవేదం జానకిరామశ

## రామాయణము

"శ్లోక ఏవ త్వయా బద్ధః నాత్ర కార్యా విచారణా
మచ్ఛందా దేవతే బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ"
"కురు రామకథాం పుణ్యాం శ్లోకబద్ధాం మనోరమామ్"

ఓ మహర్షీ! నీ నోటివెంట ఛందోబద్ధమైన శ్లోకము వెలువడేట్లు నేనే అనుగ్రహించాను. మనోహరంగా శ్లోకాలలో శ్రీరామకథను రచించు. అది విశ్వవిఖ్యాతమై అలరారుతుంది. జరిగినదానిని గురించి విచారింపకు– అని విధాత వాల్మీకిమహర్షితో పలికాడు. కరుణాంతరంగుడైనవాడు వాల్మీకిమహర్షి. రామకథను తెలియచేసినవాడు దివ్యర్షియైన నారదుడు. శోకాన్ని శ్లోకరూపంలో పలికింపచేసినవాడు సృష్టికర్తయైన బ్రహ్మ. ఇన్నివిధాల అనిర్వచనీయమైన విశిష్టత ఏర్పడింది కనుకనే పరాపరవిదుడై, మహర్షియై, మహాకవి కాగలిగాడు వాల్మీకి!

వాల్మీకి మహర్షి రామాయణరచన పూర్తిగావించి, తన ఆశ్రమంలో ఉంటున్న కుశలవులను గానం చేయటానికి ఎన్నుకుంటూ రామాయణ ప్రాశస్త్యం ఇలా వివరించాడు.

"పాఠ్యే గేయే చ మధురమ్, ప్రమాణైస్త్రిభిరన్వితమ్
జాతిభిస్సప్తభిర్బద్ధం, తంత్రీలయ సమన్వితమ్
రసైశ్శృంగార కారుణ్యమ్, హాస్య వీర భయానకైః
రౌద్రాదిభిశ్చ సంయుక్తం, కావ్యమేతదగాయతామ్"

రామాయణం పఠనయోగ్యమూ, స్వర విశేష సమన్వితమై గాన యోగ్యమూ కూడ అయియున్నదనీ, సంగీతశాస్త్రానుసారంగా ఏర్పడే అనేక లక్షణాలతోను, శృంగారాది రసాలతోను నిండిన మహాకావ్యమని మహర్షి వచించాడు.

## సుందరకాండ

రామాయణములో గల అన్ని కాండములలోనూ సుందర కాండము పరమపవిత్రము. బాలకాండ, అయోధ్యకాండ మున్నగు నవి ఆయా కథలనుబట్టి ఏర్పడిన పేర్లు. కాని ఈ సుందరకాండ మాత్రము కేవలము కథను సూచించునది కాదు.

"సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా
సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనం
సుందరే సుందరం కావ్యం సుందరే సుందరం కపిః
సుందరే సుందరం మంత్రం సుందరే కిం న సుందరం?"

ఇందు సీతారామాంజనేయులు సుందరులు. కథ, కావ్యములు సుందరములు. వనము, మంత్రములు సుందరములు. సుందరకాండమున సుందరము కానిదేమున్నది? సమస్తము సుందరమని భావన! అంతే కాదు మిగిలిన ఏకాండమునకూ అధికముగా లేని పారాయణ యోగ్యత ఈ సుందరకాండమునకున్నది. బ్రహ్మాండ పురాణమీ కాండను "సమస్తమంత్ర రాజమ"ని ప్రశంసించినది! ఆంజనేయస్వామికి "సుందరు"డనే నామాంతరం ఉన్నందువలననే వాల్మీకి మహర్షి ఈ కాండమునకు "సుందరకాండ"మని ఎంతో దూరదృష్టితో నామకరణం చేసినట్లు విశేషజ్ఞులు వివరించారు.

## సుందర మందారము

ఈ ఆధునికయుగంలో గీర్వాణసాహితీప్రియులు ప్రాచీనకవితా ప్రశస్త్యాన్ని తెలుసుకొని, అందలి నిత్యసత్యాలను, ఆనందానుభూతినీ విస్మరింపలేక ప్రాచీనకవిత్వ మర్మవిదులు కావటంచేత ప్రాచీనపద్ధతినో దానికి దగ్గరిమార్గాన్నో అనుసరిస్తున్నారు. అట్టివారిలో "శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారు ఒకరు. వీరు సంస్కృతాంధ్రాలలో మంచి పాండిత్యం సంపాదించి, కావ్యకర్తలై తెలుగునాట పేరెన్నిక గన్నవారు. వేంకటేశ్వర శాస్త్రిగారు రామాయణ కావ్యగతమైన హృదయంకలవారు కావటంచేత తమ రచనకు రామాయణ సంబంధి అయిన సుందరకాండను ఇతివృత్తంగా ఎన్నుకున్నారు. సమాజంలో

కానవస్తున్న మార్పులను చూస్తూ, మన సంస్కృతికీ, సంప్రదాయా నికీ భంగంరాని విధంగా 'సుందర మందారాన్ని' తీర్చిదిద్దారు.

శరవేగంతో మారుతూఉన్న కాలంలో ఉండి, నూతనమైన దృక్పథంతో సాహిత్యపువిలువలనులెక్కగట్టే ఈరోజులలో సాహిత్య సృష్టి చేయటానికి పూనుకున్న శాస్త్రిగారు ప్రాచీన సాహిత్య మర్మా లను తెలిసినవారు కానటంచేత చాలా నేర్పుగా వ్యవహరించారు. ఆది కావ్యమయిన రామాయణంలోని ఇతివృత్తాన్ని తీసుకొని అది తేట తెల్లంగా పాఠకులకు తెలిసేటట్లు "సుందరకాండము" అనే పేరుపెట్టి ఉంటే అది కేవలం సాధారణంగానే ఉండేది. కాని కవితాహృదయం గల శాంతిశ్రీగారు మహిమాన్వితమయి, పూజనీయమయిన సుందర కాండమును వాడనిదీ, సుగంధయుతమైనదీఅయినమందారపుష్పంతో పోల్చారు. సుందరకాండముయొక్క నిత్యనూతనత్వాన్ని, కవితా పరి మళ తత్వాన్నిమనోహరంగాసూచించారు! 'పాఠ్యే గేయేచ మధురమ్' అని వాల్మీకిమహర్షి చెప్పినదానిని శాస్త్రిగారు మననంచేసి మందా రాన్ని గేయాలలో రచించారు. ఆ గేయాలుకూడా ఒకేవిధంగా కాక కథా సందర్భాన్నిబట్టి వివిధరీతులలో రచించారు. ఇతివృత్త, రచనావిధానాలలో ప్రాచీన నవీనతలకు సఖ్యతగావించారు.

అంకితము-అద్వైతభావము

భక్తిప్రపత్తులతో భగవంతుని ఆరాధించే శాంతిశ్రీగారు తమ సుందరమందారాన్ని శ్రీ వేంకటేశ్వరస్వామికి సమర్పించి జన్మ చరి తార్థము చేసుకున్నారు. అంకిత పద్యాలు శాస్త్రిగారి హృదయాన్ని, అద్వైతభావాన్ని ప్రస్ఫుటంచేస్తున్నాయి.

ప్రాయుమని పట్టి వ్రాయింప వ్రాసినాను
పలకరాయన్న ఇది యేదొ పలికినాను
దేవ! కృతికర్త కృతిభర్త నీవె- నేను
తగుదునే కేవలము నిమిత్తమ్ము గాక!

ఇందులో శాస్త్రిగారు వేదాంతసారంగా భాసించిన జీవాత్మ పర మాత్మల ఐక్యతను "కృతికర్త కృతిభర్త నీవె" అని వెల్లడించారు.

కవితా సౌందర్యము

ఈ సుందరమందారంలో 'సమర్చన' మొదలుగా 'పట్టాభిషేకము' వరకు కవితా కేసరాలు పరిమళించాయి. "సముద్ర తరణము" అనే శీర్షికలో హనుమంతుని వర్ణిస్తూ-

ఆగమన వేగమున కబ్ధి యడుగగుపించె
జనకరాజ తనూజ తనలోన లేదంచు
చిత్తమ్ము నంబునిధి చీల్చి చూపినయట్లు

వాయుపుత్రుని గమనవేగానికి సముద్రం అడుగుభాగం కనిపించిందట. సీతాన్వేషణకోసం వెడుతూఉన్న ఆంజనేయస్వామికి ఆమె తనలో లేదని సముద్రము కోరి చూపించినట్లుగా ఆ దృశ్యం వర్ణింపబడింది. ఎంత మనోజ్ఞమైన భావన! "అన్వేషణము"లో లంకానగరం ఈ తీరుగా ఉన్నది-

ఆకాశమ్మును చుంబించే సదనమ్ములు
రాకాశశి తలదన్నే స్త్రీ వదనమ్ములు
లోకాలను పోకార్చే ఘోరాస్త్రమ్ములు
నాకాంగన లెఱుగని విచిత్ర వస్త్రమ్ములు!

ఇందులో రావణుని పలువిధాలైన ఐశ్వర్య రమ ఆలోచించినకొద్దీ ఆశ్చర్యానందాలు చేకూర్చేదిగా ఉన్నది. "మహేంద్రము"లో ఆంజనేయస్వామి సముద్రంలంఘించే ఘట్టం మనోహరంగాను, కార్యవ్యగ్రతను కళ్ళకు కట్టేదిగానూ ఉన్నది-

ఆంజనేయస్వామి అంజలిని ఘటియించి
ఆనందము భజించి అమృత స్వరూపుడై
ఇంత వాడంతలో ఎంతో పైకెదిగాడు!
ఆకాశవీథి కల్లంత వాడైనాడు
అంబుదమ్ముల పైని అంతవాడైనాడు!

అమృతాంశు రుచి మించి అంతవాడైనాడు
అర్కమండలమంటి అంతవాడైనాడు
సత్యమంతైనాడు నిత్యమంతైనాడు
సాహిత్య మూర్తియై సర్వత్ర నిండాడు !

ఈ విధంగా ఆనందాతిరేకంతో, జలాతిరేకంతో పరవళ్ళుత్రొక్కుతూ సీతాన్వేషణ తత్పరుడై ఆంజనేయస్వామి సముద్రతరణానికి చేసే ప్రయత్నం, ఆ స్వామిరూపం, ఇందు కళ్ళకు కన్పిస్తుంది. ఆంధ్ర మహాభాగవతంలోని వామనావతార ఘట్టంలో- "ఇంతింతై వటుడింతయై, మఱియు దానంతై" అనే పద్యం పై గేయాలను చదువుతూ ఉంటే భావనాపథంలో మెరుస్తుంది.

కవితా తత్త్వమెరిగిన శాస్త్రిగారు సుందర మందార కృతిలో పలుతావుల లెస్సగా, గసవంతంగా రచన చేశారు. ఏ భాషలోనైనా సాహిత్యప్రయోజనం- ఆనందానుభూతిని పర్వరచటం, అనశ్వరమైనదానిని రసయుతంగా సృష్టిచేసి దానిద్వారా పఠితకు బ్రహ్మానంద సహోదరస్థితిని కల్పించటము. ఉత్తమకవి ముందుగా సౌందర్య ద్రష్ట అవుతాడు. క్రమంగా సౌందర్యోపాసనా బలంచేత సౌందర్యస్రష్ట కూడ కాగలుగుతాడు. శాస్త్రిగారి చేతిలో ఈ నూతనకావ్యం రసవంతమై ప్రాచీన అధునాతన మార్గాలను సమాధానపరచేదిగా ఉండటంలో విప్రతిపత్తి లేదు. ఇందు గేయరచన చేసేటప్పుడు శాస్త్రిగారు విశ్వనాథవారిని అనుకరించాలని చేసిన ప్రయత్నం కనబడుతుంది. రామాయణంలో ఉన్న కళాసంపదనూ, పారమార్థికతత్త్వమునూ వర్ణనావైభవమునూ హృద్గతంచేసికొని వేంకటేశ్వర శాస్త్రిగారు ఈ గేయ కావ్యం వ్రాసి ధన్యులైనారు. వారికి శ్రీరామచంద్రుడు ఆయురారోగ్య భాగ్యాల ననుగ్రహించుగాక!

ఓం తత్ సత్

# మందార మకరందము

"రామ కౌండిన్య"

చిరంజీవి జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి పరిచయం పర్యాప్తముగా లభించినది. 'సతాం సంగతం సాప్తపదీనమ్' అనిన కాళిదాసు ప్రవచనం ప్రతిఫలించినది.

శ్రీ శాస్త్రిగారు ప్రశాంతి సూచకముగా 'శాంతిశ్రీ' అనెడి సుకుమారాంకము ధరించినారు. వీరి కృతులు మూడు ఆంధ్రికి బహూకృతులైనవి. నవ్యతకు త్రిస్థాయిగా నున్నది వీరి కావ్యత్రయి.

శాంతిశ్రీ కృతులు

"జ్యోతిర్మయి" ఈ కవితా తపస్వి తన సారస్వతోపాసనా పీఠిపై వెలిగించిన సుందర సురుచిర జ్యోతి.

ప్రథమ కాంతిరేఖ 'కల్యాణమూర్తి'లో ఘనతర భక్తి రసావేశపూర్వక అభినందన అభినందనీయమే—

మరచి మత్తిల్లి వారిని తరచి తరచి
అంతకంతను రాబట్టు పంతగాడు

ఈ పలుకుబడి లోకసామాన్యమైన నగ్న సత్యమును వెల్లడించినది. కల్యాణమూర్తి కరుణాస్వభావముతో పాటు ఆ శ్రీవారి గడుసుదనం హాస ధ్వనితమైనది. ఔను! నిజమే ఇది. చాలినంత గడుసుదనం లేకున్నచో ఆస్వామి అనుదినము పెండ్లిపీటల మీదికి ఎట్లు వేంచేయుగలడు? కవిగారిచ్చిన "కల్యాణ మూర్తి" బిరుదమెట్లు సార్థకమగును! కానిండు ప్రధానముగా ఈ జ్యోతులు పెక్కుతావులందు రచయితకుగల జాను తెనుగునందుగల ఆప్యాయతను వెలుగులోనికి తెచ్చినవి.

"త్యాగమయి" ద్వితీయపుష్పము. వంశాభిజాత్యయు దేవ్యంశసంభవయునైన వాసవీకన్యకా చరితము భక్తి, వాత్సల్య, కరుణ రస భరితమై ఒప్పారినది. ఇది సంస్తవనీయమై లోకాతీతమైన మహోన్నతాదర్శ దర్శనమైన రసస్పర్శము.

తృతీయపుష్పము "ఉదహారణత్రయి". ఇది మూడు ఉదాహరణ కావ్యముల గుచ్ఛము. శారద సత్యసాయి విశ్వనాథల గూర్చి ఉదాహరణలు. దానికదే ఉదాహరణ మన్నట్లుగా వేయిభంగుల విద్వత్కవి ప్రకాండుల మన్ననల ననుమతించినది. ఇందు శారదోదాహరణము నాయకమణియైనది.

"....పద్మజురాణి, కవీంద్రవాణి" అనుటలో సృష్టికర్త అతనిరాణికి కూడ దివ్యకిరీటాలు పెట్టినట్లైనది. ఇంకను ఎన్నదగినది దీనిలోని ఒక మధురాపకము. అష్టవిభక్తి కాళికారాధనము. అష్టదళ పద్మము పై సరస్వతీ దేవ్యర్చన భక్తికి పరాకాష్ఠ.

ఇట్లీ మూడుకృతులు ఒకదానికొకటి ప్రశంసితములై పఠితలను త్రికరణశుద్ధిగా అలరించుచున్నవి.

మందార మకరందము

శాస్త్రిగారి నూతన కృతి ఈ గేయకృతి 'సుందరమందారము' ఇది వికచ మందారము. నవకముపసు ఆకరము. ఇది సుజన సేవ్యమై సద్భక్త సంభావ్యము. ఇది సరసమైన రచనా స్రోతస్విని. కవిలోకరంజని పాపబాధా విభంజని. సుందరుని పావన గాథావాహిని. ఇది భక్తిరస స్నేహము. సీతాన్వేషము. పరమభాగవతులకు శాంతి రమా న్వేషము

ఈ కావ్యములోని రచనా రామణీయకత, శైలీ సౌభాగ్యము సహృదయ హృదయైక వేద్యము.

విశ్వసాహిత్యంలో రామాయణం కలమానికం. అందు ఆర కాండములలో అమందానందకందమైనది సుందరకాండము. దీని తీసికొని లలిత లలితములైన అలతి అలతి పల్లవ పదములతో సర జనానురంజకమైన ద్రాక్షాపాకమున కవిత విస్తరించినారు శ్రీ శాస్త్రి గారు. వీరు తమ దేశికవితానైపుణికి విజయపతాకను ప్రతిష్ఠించినారు వీరు కవితారంగములో గేయమాధురీ ధ్వనితమైన ధనుష్టంకార మొ ర్చినారు.

పావని చరణ సేవాచరణమే ఈ కావ్యోపకరణము. ఇది భక్త లోక శరణము. ఉపనిషత్తుల్యము. ఇది సభక్తి వీరతాధ్యాయము. సుందరాదంత సముదాయము. సువ్రతుని కీర్తి గేయము.

ఈ రచనలో శాస్త్రిగారు కథానాయకుని మహావేశము పంచుకున్నారు. సారస్వత భంగిమల విపుల విహారమునందు స్వేచ్ఛా విహార హారి యైనారు. బహువిధముల ఛందోరీతులు ప్రదర్శించినారు. గేయములేకాక ఎడనెడ కందాలు, గీతాలు, వృత్తాలువంటి ఛందో నిబద్ధములు సమయోచితములై కావ్యరూపమునకు అనురూపములై గ్రాంథిక భావుకులకు ప్రియంభావుకములైనవి.

సూక్తి ముక్తావళి

రామకార్య సమారంభ సంరంభమే, రామదాస విజృంభణమే ఈ గేయకావ్యానికి పాథేయము, ధ్యేయము.

"రామకార్యము ప్రజా క్షేమకార్యమ్ము"

ఇది సూత్రప్రాయమైన వాక్కు. ఆర్యోక్తి. లౌకిక పారలౌకిక రాజ నైతిక త్రిసత్యమిది.

"దీక్షతో సేవించు దేశభక్తుండు
వింతలు వినోదాలు విడనాడవలెను"
"మాననీయులు కార్యక్రమాలలోన
ఎట్టిమార్పును కూడ సహింపలేరు"
"జారవిడిచిన క్షణము కోరినారాదు
మంచిమాటల నెపుడు మరచిపోరాదు"
దీపమున్నప్పుడే దిద్దవలె నిల్లు
"దేహబలమున్నపుడె దేవ పరిచర్య"

ఈ పంక్తులు గురజాడవారి దేశభక్తి గీతములను తలంపునకు తేగలవు. ఈ సమాధానము దేశభక్తునితోబాటు దైవ భక్తునకును హితోక్తులై, మందలింపులై ఇంపుగొల్పును.

"నామమ్ము జపియించు రామభక్తుండవు
ప్రజనుండి కానుకలు గ్రహియింప రాదు
జన సమూహము నుండి సాధనాపదము
అవసరము సత్కార మాశింపరాదు"

ఇంతకన్న గుణపాఠమేమిగలదు? ఇది గుణపాఠమే కాదు. ఇదే కదా దేశభక్తునకు రమేశభక్తునకును ప్రవర్తన సాధనలందు పరమావధి, పరమలక్ష్యము!

"ప్రణవమ్ముపాసించు పరమభక్తుండవు
దానధానము తోడ తనరారవలెను"
"ఫల సంగ కర్తృత్వములు విడుచు ఘనుని
ఏ కర్మగతులు బంధింపనేలేవు"

అనుటలో గీతార్థసారమును సుకుమారముగా వినిపిస్తూ పరమభక్తుని లక్ష్యముకూడ చెవినిబడవేసినారు. "జ్యోతిర్మయి" కావ్యంలో వేంకటేశ్వరునికి అంటగట్టిన గుణసుందనము రవంత వీరిలోనూ గోచరించు చున్నది. ఇది నామసామ్యము వల్లనా!

అలంకారాల కలంకారీకనము

అలంకారములకు ఆలంబనము ఉపమ. అది కావ్యవాహినికి మకరంద రసోపమ. ఇది శాస్త్రిగారికి అన్నింటికంటె ప్రియమైన నగ మేమో. గ్రంథములో అన్ని ఘట్టములలోను ఈ అలంకారము క్రేంకార మొనర్చినది.

శింశుపా తరు నిబిడశాఖాంతరవర్తి, రామాంతరంగస్థుడైన హనుమంతుడు గుట్టుగా ఇలా ఉన్నాడట.

"చిగురుటాకులలోన చిల్క వాలిన రీతి
చంకెక్కగానచ్చు చంటిపాప విధాన
భాగవతశాఖిపై పరమర్షి శుకునిలా
అశ్వత్థ తరువులో అచ్యుతుని మాద్రిగా

పొన్న చెట్టూపైన కన్నయ్య ఉన్నట్లు
గున్నమామిడిపైన కోకిలమ్మ విధాన''

దాగిన చందమునకై మూగిన ఉపమలు ఋషులను, అవతార పురుషులను అందుకొని అందగించినవి. చంకెక్కు పసిపాపగా నుండగోరునట్టి భక్తియే కదా ఆ హనుమంతునిది! మరొకచోట హనుమంతుడు

"ఉల్కలాగున్నాడు శత్రువులకు
చిల్కలాగున్నాడు మిత్రులకును''

'మాతృ సందర్శనము' అనే అధ్యాయములో ఉపమలు అవిరామంగా సాగి రసావేశము రేపి సీతమ్మ రూపు చూపగల్గినవి. కొన్ని మాత్రము తిలకించండి.

శోభా విహీనమై శుష్కించు తీవలా
అగ్ని తప్తంబైన అపరంజి రాశిలా...
కాకిమూకల నడుమ కోకిలమ్మ విధాన...
మోహార్థి యైయున్న పుణ్య తాపసి వోలె
బొగ్గులందున మణి మహాసిగ్గుతో నున్నట్లు...
దావాగ్ని మధ్యలో తపియించు తరువులా
సింహముల మధ్యలో చింతించు కరిణిలా...
శ్వగణమ్ము మధ్యలో వగచెందు లేడిలా
దీనురాలైయున్న దేశమాత విధాన

ఉన్న జనకాత్మజను సాటిగా నగజాతను, దేశమాతను తలపింపజేసినారు శాస్త్రిగారు. లలితలలితముగా అక్కడక్కడ వాకొనబడిన వీరిలోని దేశభక్తి వివేకానందుని తలంపునకు తెచ్చినది.

మందార సౌందర్యము

ఈ రచన ఎందును కావ్యలక్షణ లక్షితమై అలరారుచున్నది. ఎచ్చటను శైలీ మార్దవమును కవి మరచిపోలేదు. కూర్పుతీర్పు లందు సౌకుమార్యము ఆపాదమస్తకము కావ్య కన్య నావహించినది.

ప పుటలో చూపు సారించినను అక్షరసౌందర్యము ప్రత్యక్షమగును. ఇయ్యది శైలికొక హృద్యమైన నగ వంటిది. అనుప్రాసల మధురిమ లకీ రచనము సుందరోదాహరణము. సులభతర అనగానానమును కథా కథన ప్రవాహమీకావ్యము.

సీతను వెదకే మారుతి లంకాప్రవేశము చేసినాడు. సర్వాంకష ముగా సంచరించుటలో అతడు చూచినదృశ్యాలు అవశ్యము ఇందు దర్శనీయములు. హాస్యరసము తొణికిసలాడే పద్యము ఇదిగో.

లంబోష్ఠులు లంబాస్యలు
లంబోదర లంబబాహ లంబకపోలల్
లంబాంఘ్రులు లంబాక్షులు
లంబాలక లంబజాను లంబనితంబల్

ఈ పద్యము లంబమైన ఉపమకు ఆలంబనము! శయన మందిరములో

"..... ఆదమరచిన స్త్రీలు
నియమ రహితమ్ముగా నిద్రించుచున్నారు"

అనుచు ముగించిన పదము ఒక అందమునందుకొన్నది. నెరజాణల నిద్ర అట్టిదే. వివిధ భంగిమల కూర్పుగా ఆ నిద్రసాగినది.

మండోదరిని చూచి సీతగా భ్రమించి తేరుకున్న మారుతి తలపులో పోతనగారి 'మందార మకరంద' సీసములోని రాసము పేరొక లలితమైన గేయ విన్యాసముగాచూపినారు. ఇది అవశ్యదర్శ నీయము.

ఈ కావ్యములోని వర్ణనలు సమయోచితములు. సముచిత ప్రమాణములు. కథాతరంగిణికి అడ్డంకులుకావు. ప్రబంధములలోని కర్కశ నారికేళ వైఖరీ రీతులవంటివికావు. ఈ వర్ణనలు ఆనాటి ధోరణికి తోరణములు !

రావణ సంహారము కావ్యమునకు ఉపసంహారమని ఎంచుట భావ్యముకాదు కదా! శ్రీరామావతారమునకు రామాయణ, కల్ప వృక్షమునకు, ఫలస్వరూపము శ్రీరామరాజ్య సౌభాగ్య ప్రదర్శనము. అదియే యుగయుగములకు ఆదర్శము.

పట్టాభిషేకమైన పిదప రామరాజ్యాభినందనము చేయుచాపిత్రి నందన నను. ఇది స్వస్తివాచకమైన ప్రశస్త మంగళాచరణము. కావ్యసుందరికిది రత్న చూడామణి.

శాస్త్రిగారి రామరాజ్య వర్ణనలోని ఒకటు రెండు పంక్తులు

"కోతికూడ ప్రవర్తించె - నీతితోడ ఖ్యాతితోడ"

ఈ వాక్కుల అంతర్భావము అనుభావ్యము. ఈ భావము నరులకు వానరులకు చిత్రముగా అన్వయించునేమో! నరులు వానరులు కూడ తులలేని నీతిమంతులై కీర్తిగాంచిరను ధ్వని పొడ కట్టుచున్నది. మరొక చిత్రము

"రామామణి ఏ ఒక్కతె
రాయిగ పడి యుండలేదు"

ఇది అద్భుతమైన భావచిత్రము. స్త్రీలు సౌందర్య సౌశీల్య గాంభీర్య గుణవతులై ధర్మపరాయణలై ఉన్నారని ఈ మాట వ్యక్తపరచు చున్నది.

"కాసులకై గడ్డి కరచువాడు లేడు
పీసమంత మోసమన్న మాటలేదు"

రామ రాజ్యమొక మహోన్నతాదర్శ ప్రజాస్వామ్యము, నిస్తులైన ప్రేమ రాజ్యము. ప్రజల ప్రేమపూరిత హృదయాలలో గడ్డి తినెడి బుద్ధి పుట్టుట పగటి యందు చీకటి జనించుట వంటిది. ఈ పంక్తులు రామరాజ్య సౌభాగ్యమును, ప్రజారాజ్యములోని జీవితపరమావధిని, అనాటి వ్యవస్థ యొక్క పరమలక్ష్యమును సూటిగా చెప్పుచున్నవి.

ఇది నవ్య కవిత కొక భంగి హృద్య నైవేద్యము.

"కరుణశ్రీ వంశీ సు
స్వర రాగ సుధానువాద సంజాత శుభం
కర పదములు శాంతిశ్రీ
వర కవితా వాదనములు వర్ధిల్లు ధరన్ !!!

ఇతి శ్రీ

# సౌందర్యమయి

చంద్రబింబ సమాకారం వాంఛితార్థ ప్రదాయకం
హనూమన్తేనిశం ధ్యాయేత్ సుందరేకాండ ఉత్తమమ్!
— బ్రహ్మాండ పురాణము

నాద బిందు కళాతీతుడు, సృష్టి స్థితి లయ కారణస్వరూపుడు, సాక్షాత్ ఈశ్వర స్వరూపుడు శ్రీ హనుమంతుడు. ఆ స్వామి చంద్రబింబ సమాకారుడు, వాంఛితార్థ ప్రదాయకుడు. ఆతడు సుందరుడు! ఆతని చరితము సుందరకాండము!

అహల్యా గౌతమఋషుల అల్లారుముద్దుల అమ్మాయి అంజనాదేవి. గౌతమ ఋషి తనబిడ్డను కుంజరుడనే వానరాధిపతికి పెంపకం ఇచ్చాడు. కుంజరుడు అంజనను పెంచిపెద్దచేసి కేసరుడనే మహావీరునికిచ్చి పెళ్ళిచేశాడు. వీరికి చాలకాలమువరకు సంతానం కలగలేదు. అంజనాదేవి పుత్రుని కొఱకై ఆదిశంకరులను గూర్చి ఘోర తపస్సు చేసింది. ఈశ్వరుడు సంతసించి సంతానప్రదమైన ఒకఫలాన్ని వాయుదేవుని ద్వారా అంజనాదేవికి పంపాడు. వాయుదేవుడు ఆ ఫలాన్ని భద్రంగా అంజనాదేవికి అందించాడు. అంజనాదేవి పుత్రవతి అయింది. అంజనాదేవి సుతుడే ఆంజనేయుడు!

అంజనా కేసరీ నందనుడైన ఈ సుందర సురుచిరమూర్తిని ఇంద్రుడు, వాయువు, సూర్యుడు, అగ్నిమున్నగు దేవతలు పుత్రసమంగా ప్రేమించి అనేకవరాలతో అనుగ్రహించారు. ఈవరప్రభావంతో ఆంజనేయుడు అతిలోక వీరుడై, బుద్ధిబల సంపన్నుడై తేజోనిధియైనాడు. ఆంజనేయుడు అప్రమేయుడు, దివ్యకాయుడు, శ్రీరామ పదారవింద ధ్యాన విలాసుడు, మహిమామయ మధుర మంజుల మానసుడు. రామునికన్నను రామనామము మహిమాన్వితమైనదని నిరూపించిన భక్తశిఖామణి, వాయువేగమును మించిన మనోవేగంగల కపిసంతానమణి. ఈ స్వామి కపీనాం కవి, నవ వ్యాకరణ తత్త్వభారవి!

బాల్యంలో ఆకలివేస్తే ప్రచండభానుబింబాన్నే ఫలమనిభావించి కబళించ ప్రయత్నించిన పరమాద్భుత పరాక్రమ సంపన్నుడు హను

మంతుడు. అతడు ఒకపాదము ఉదయపర్వతముపై మరియొక పాదము పశ్చిమపర్వతముపై నుంచి సప్తాశ్వ రథారూఢుడైన సూర్యభగవానుని యొద్ద సర్వవేదవిద్యలను దీక్షతో నేర్చిన విజ్ఞాన జిజ్ఞాసువు. రామనామం లేని రత్నమాలను పరిత్యజించిన ధన మోహ స్వార్థగుణప్రత్యర్థి, ఒక వానరరాజును రామపరబ్రహ్మ సామీప్యం కలిగించిన మంత్రీశ్వరుడు హనుమంతుడు హిరణ్మయమైన దేహమునంటి లంకలో జీవాత్మను దర్శించి లోకమాతను పరమాత్మతో చేర్చిన మహాతత్త్వ జ్ఞానేశ్వరుడు దాతడు. తనప్రభువు ఆవలించునప్పుడు చిటికెలువేయు చిన్నపనిని స్వీకరించి దేవాదులనుసైతము తలక్రిందులుచేసిన యుక్తితత్పరుడు. చిటికెడు సింధూరము పాపటధరించి అసమాన సౌభాగ్యమందినసీతా దేవితో పోటీపడి దేహమంతా సింధూరముపూసుకొని సీతారాము లను పరమానందపరచిన సింధూర సుందర గాత్రుడు అంజనా పుత్రుడు!

ఆ దివ్య సుందరుని అనంత లీలావిలాసాలలో ఒక తీయని ఇక్షు ఖండము సుందరకాండము. ఇందలి శబ్దార్థ రసములు సుందరములు శ్రీరాముడు సుందరుడు, సీత సుందరి, హనుమంతుడు సుందరుడు. ఈ విధముగా జీవాత్మ పరమాత్మల సౌందర్యములు, ఆచార్య ఆధ్యాత్మ సౌందర్యములు ఒకదానికొకటి శిరస్ఫూర్తిగా ప్రతిబింబించుట చేత ఇది "సుందర" కాండమైనదని పండితవాక్కు.

సుందరకాండ ఎన్నో రూపాలలో విస్తృతమైఉంది. శ్రీ భాష్యం వారు సుందరకాండకు సంశోధన వెలయించారు. శ్రీ యం. యస్. రామారావు తమ మధురగానంతో సుందరకాండనుజనప్రియంచేశారు. ది వాకర్ల వేంకటావధానిగారు గేయకృతిని రచించారు. ఉష శ్రీ గారి సుందరకాండ వచనం మంగారూపుతమై ప్రసరించింది. ఇంకాఎందరో మహానుభావులు! నా భక్తిప్రపత్తులు నావికాసాన నేనూ వ్రాసుకున్నాను. ఈ కావ్యంలో ముత్యాల సరాలు మిలమిల లాడాయి. మంజరులు ఉయ్యాలలూగాయి. ద్విపదలు షట్పదాలై గానంచేశాయి. మధ్యమాక్కర మధ్యాక్కరలు, కందాలు అందగించాయి. ఆటవెలదులు, తేటగీతులు సీసాలు తొంగి తొంగి చూశాయి ఈ మాత్రా ఛందంలో కేవలం

భావానికి ప్రాధాన్యం ఇచ్చి వెంట వెంట మార్పులు చేశాను. భావం ఒకటే అయినా స్ఫూర్తి కోసం లయమారుస్తూ క్రొత్త ఛందాన్ని అందిస్తూవచ్చాను. సుందరకాండను మాత్రా ఛందస్సులో భావ ప్రధానంగా వ్రాయాలనే నా భావనకి ప్రసిద్ధహరికథకులు శ్రీమాన్ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసుగారు, యాళ్ళబండి తాతారావు భాగవతార్ గారు ఉత్సాహ వాతావరణం కల్పించారు. మహావిద్వాంసులు శ్రీ భాష్యం వారు ఆశీర్వలాన్ని అనుగ్రహించారు.

మధుర కవితా సుధాకరులు మా "కరుణశ్రీ" బాబాయి గారి చిరునవ్వు వెన్నెలలు నా కవితకు మార్గదర్శకాలయినాయి. 'ప్రగతి గీతా ప్రవక్త' డా. నంబూరి రామకృష్ణమాచార్యగారి చిన్నారి మన్ననలు ఈ మందారానికి మాధుర్య సౌందర్యాలు సంతరించినాయి. ఉపన్యాస విన్యాస యశశ్రీ శ్రీ ఉషశ్రీగారు శుభాకాంక్ష పలికారు. సరసహృదయులు శ్రీ సామవేదం జానకిరామ శర్మగారు సులోచనాలతో చూచి "సుందర సమాలోచనము" ప్రసాదించారు. రసజ్ఞులు రామకౌండిన్య గారు "మందార మకరందము" కోసిన్ఫ్యూతోపట్టి అందించారు. తిరుమల తిరుపతి దేవస్థానం అని చేతలు శ్రీ పి. వి. యస్. కె. ప్రసాద్, శ్రీ కాట్రగడ్డ సుబ్బారావు గారలు భుజంతట్టి ముద్రణ వేసుకోమన్నారు. అందరికీ నా కృతజ్ఞతాభివందనాలు!

చక్కని ముఖపత్రాలు రచించి ఈ కృతికి అలంకృతి గావించిన ప్రసిద్ధ చిత్రకారులు శ్రీ బాలగోపాల భాస్కరరాజుగారికి, శ్రీ వి. కామేశ్వరరావు గారికి, ఈ కావ్యమును ముచ్చటగా ముద్రించిన సర్వోదయ ముద్రణాలయాధిపతులు "కళాప్రపూర్ణ" వాతూరి నాగభూషణం గారికి, లక్ష్మీనారాయణ గారికి అభినందనలు. నా కవిత్వమును సదా అభిమానించే "కళాప్రపూర్ణ" శ్రీ పసల సూర్య చంద్రరావుగారికి, తెలుగు సాహితీసమాఖ్య సభ్యులకూ, సహృదయు లందరికూ అనురాగ పురస్సర అభివాదాలు!

—శాంతిశ్రీ



# సమర్పణము

హే దయాంబుధీ! సర్వ లోకైకనాథ!
కోటి మన్మథ సౌందర్య కోమలాంగ!
భక్తవత్సల సప్తపర్వత నివాస!
భవ్య పద్మావతీ మనః పద్మ భృంగ!

నీ వధిపతివి - లోకముల్ నిన్ను గొలుచు
పరము నీ చేత నబ్బు - నీకొరకు నిలచి
నాను - నీవల్ల సుఖమబ్బు - నతులు నీకు
జగతి నీయందు నున్నది - సారసాక్ష!

హృదయమందు మలిన మిసుమంత లేకుండ
భక్తితోడ శుభ్ర పరచినాను
అంతరంగ మనెడి హంసతూలిక పైన
కూరుచుండుమయ్య కొంత తడవు!

పూలలో వాసనలు పూచి ప్రోగుచేసి
మధుర సుందర మందారమాల గూర్చి
కంఠమున వేసి నిను జూచు కాంక్షతోడ
క్షణము క్షణము నీకయి ప్రతీక్షణము నేతు!

నీదు ముఖచంద్ర కాంతికి నిలువ లేక
పది విధమ్ముల పాదాలు పట్టివేడ
చంద్రునకు నిచ్చి తమ్మృత తేజః ప్రదీప్తి
ఆశ్రితానంద మందారమా! నమోస్తు!

పరమ పావన వేంకటేశ్వరుడ వీవు
పతిత జీవన వేంకటేశ్వరుడ నేను
కొండ కొమ్మపై నీవు కూర్చుండినావు
నేను భవ బంధ పటలి బంధింప బడితి!

వ్రాయుమని పట్టి వ్రాయింప వ్రాసినాను
పలుకరా! యన్న ఇది యేదో పలికినాను
దేవ! కృతికర్త కృతిభర్త వీవె – నేను
తగుదునే కేవలము నిమిత్తమ్ము గాక!

స్వామీ! నన్ను రచించుమంచు సతమున్
సాధింతువే కాని నా
కే మాత్రమ్ము వినూత్న భావలహరీ
హేలా కళా విస్ఫురత్
ధీ మార్గ ప్రతిభా ప్రకర్ష రుచులు
దీపింపగా జేయ – వే
దే మానో – రచియించి తెచ్చితిని – నీ
యిష్టమ్ము నీ కిచ్చితిన్!

# సుందర మందారము

## కవితా కింజల్కములు


సమర్చన
కావ్య సౌందర్యము
సమాలోచనము
సంప్రార్థనము
మాహేంద్రము
సముద్ర తరణము
మైనాకము
సురస
ఛాయాగ్రాహిణి
త్రికూటము
లంకిణి
బంగారులంక
అన్వేషణము
పుష్పకము
శయన మందిరము
అశోకము
మాతృ సందర్శనము
ప్రలాపము
మాతృ హృదయము
కటుభాషణ
మనోనిశ్చయము
సుస్వప్నము
అవతరణ
సంభాషణము
ముద్రికా ప్రదానము
సమ్మోదము
విజృంభణము
రావణ వైభవము
ప్రబోధము
ప్రజ్వలనము
పునరాగమనము
మధువనము
చూడామణి ప్రదానము
నివేదనము
పట్టాభిషేకము
మంగళము

# సమర్పణ

ఇందురేఖా విభూషణ నందనునకు
పరిణతానంద సందోహ బంధురునకు
అమిత కరుణాత్మునకు సింధురాననునకు
భక్తమందారునకు శత వందనములు!

సుందర రసాత్మ కావ్య విస్ఫురణ కొఱకు
సర్వ విఘ్నోప శాంతి రక్షణము కొఱకు
పార్వతీ సూను నఘతమో బాలభాను
అరుణ చరణారవిందమ్ము లాశ్రయింతు!

కూజంతం రామ రామేతి
మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలమ్!

శ్రీ రాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి!

మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి!

రామా! నిన్ను తలంచి కావ్యమును
ప్రారంభించుచున్నాను నీ
ప్రేమన్ నాపయి జూపి నా కవిత
నావేశించి వ్రాయించి సం
క్షేమాభ్యున్నతి గూర్చుమా! వికచ
రాజీవాక్ష! భక్తప్రియా!
స్వామీ! దీనజనావనా! భువన
రక్షా దక్ష! సీతాపతీ!

రామ కీర్తన చేయు స్థలమ్ములందు
హర్ష బాష్ప నేత్రాలతో శీర్షమందు
అంజలి ఘటించి యుండు భక్తాంజనేయు!
సుందరయ్యా! సుప్రహ్వాభివందనములు!

సుందరము శబ్దమ్ము సుందరము అర్థమ్ము
కావ్యరస తత్త్వమ్ము కల్యాణ సుందరము!

సుందరుడు అభినేత సుందరి మహీజాత
పవనజుని మానసము పరిపూర్ణ సుందరము!

సుందరము దైవమ్ము సుందరము జీవమ్ము
ఆచార్య సంయోగ మత్యంత సుందరము!

# కావ్య సౌందర్యము

రామాయణ గ్రంథం! జనగణ
పారాయణ గ్రంథం!
నారాయణ గ్రంథం! శ్రీమ
ద్రామాయణ గ్రంథం!

యుగయుగాలలో జగజగాలలో
మునిజన తత్త్వపు ముద్రను చూపిన
చెదరని భద్రత జాతికి నేర్పిన
సుధా మధురిమల కథా బంధము
రామాయణ గ్రంథం జనగణ
పారాయణ గ్రంథం!

సురలచేత ఋషులచేత
సన్నుతులును సన్నుతులును
అందిన కవితా మందారం
సుందర సురుచిర మణిహారం
రామాయణ గ్రంథం జనగణ
పారాయణ గ్రంథం!

ఆర్ష సంస్కృతికి ప్రతీక
ఆదర్శాలకు పతాక
నిత్య సత్య మార్గదర్శి
శివ సుందర కార్యదర్శి
రామాయణ గ్రంథం జనగణ
పారాయణ గ్రంథం!

రామాయణ కావ్య సుమంలో
రస కింజల్కము సుందరకాండము
రామాయణ కేదారంలో
వసవత్ ఖండము సుందరకాండము!

రామాయణ క్షీరాంబునిలో
అమృత భాండము సుందరకాండము
రామాయణ కల్పతరువుపై
రమ్య ఫలంబీ సుందరకాండము।

రామాయణ గంగానదిలో
ప్రయాగ తీర్థము సుందరకాండము
రామాయణ గగన తలంలో
సుధాంశు బింబము సుందర కాండము!

రామాయణ మేఘమాలలో
తరళ తటిల్లత సుందరకాండము
రామాయణ ఋతుచక్రంలో
వసంత వల్లరి సుందర కాండము!

కార్యసిద్ధికి రత్నామణి ఇది
మారుతి మహిమకు నికషోపలమిది
భక్తి రసాయన జీవనౌషధము
ముక్తి వరప్రద సుందర సుపథము!

క్షేమము స్థైర్యము దృఢారోగ్యము
మహైశ్వర్యము మహా ధైర్యము
వాక్పటుత్వము వర సాహిత్యము
అక్షయ సిద్ధికి అమృత కాండము!

మారుతి చరితము మధురము మధుతము
మారుతి వచనము మధురస భరితము
మారుతి రూపము మహేంద్ర చాపము
మారుతి నామము మంగళ ధామము!

మారుతి ప్రవృత్తి మోహము నివృత్తి
మారుతి భారతి మంజుల హారతి
మారుతి మాటలు మంచికి బాటలు
మారుతి మంత్రము మానస యంత్రము!

తప్తశాతకాంచన కాంతి దేహము
లుప్త కామ వికార మోహము
తరుణ భాస్కర సదృశ వదనము
అరుణ సుందర కిరణ సదనము!

పింగళారుణ నయన యుగ్మము
మంగళప్రద చరణ యుగ్మము
మకర కుండల శ్రవణ యుగ్మము
ముకుళితోజ్జ్వల హస్త యుగ్మము!

రామదూత స్వరూప స్మరణము
రాక్షసీ గుణ నిరాకరణము
రామభక్తుని పరాక్రమము
నింగి నేలయు సమీకరణము!

మారుతాత్మజు మానసంబు
పొంగి పొరలెడి పాలవెల్లి!
పవన తనయుని పద స్మరణము
భక్త కోటికి కల్పవల్లి!

# సమాలోచనము

సుందరకాండ సుధామధురిమను
అందరు గ్రోలుడు జనులారా! సజ్జనులారా!

అదిగో! కనుడా దక్షిణదిశ
దవిసూపు దోలెడి రాజ్యపుమిస
ఆశను కలిగించెను ఆదిశ
దేశములోసిక తొలగు విపద్దశ

అదిగో అదిగో మహేంద్రగిరి
అందము లొలికెడు సుందరగిరి
అది రమ్య మహోన్నత శిఖరి
హరి వీరులు అట చేరిరి

అది కదలక నిలిచిన దిక్కరి
కపి యోధులు దానిని చేరిరి
వానర వీరులు స్వజ శరీరులు
మూగిరి చేరిరి మహేంద్రగిరిపై

భీరులు పారిరి గిరి కందరముల
చారులు శోధించిరి పరిసరముల
ధీరులు యోచించిరి వ్యూహమ్ములు
బాహులు తీరె సమూహమ్ములు

మంత్రులు చేసిరి మంత్రాలోచన
ఆర్యులు చేసిరి పర్యాలోచన
సూక్ష్మ కుటుంబము శుభముగ చూచెను
వానరబుద్ధి కుపాయము తోచెను

"వానరులారా! శత యోజనముల
వారిధి లంఘించెడి వారెవ్వరు?
దారుణ శత సహస్ర భట రక్షిత
దానవ పురి జేరెడి వారెవ్వరు?

అమ్మలగన్నమ్మను సీతమ్మను
అన్వేషణ చేసెడి వారెవ్వరు?
ఘన సంయములై నేర్పున ఏలిక
కార్యము సాధించెడి వారెవ్వరు?

దీక్షితమతి అసిధారా వ్రతమున
దక్షత చూపించెడి వారెవ్వరు?
అతులిత ప్రజ్ఞను ప్రదర్శించెడి
చతురులైన కపిపుంగవు లెవ్వరు?

మంత్ర తంత్ర విద్యావిదు లెవ్వరు?
మానిత బహు ప్రతిభానిధు లెవ్వరు?
అసురశక్తి చీల్చెడి వారెవ్వరు?
అపరశక్తి కొల్చెడి వారెవ్వరు?

యుక్తాయుక్త మెరింగెడి వారును
ముక్తసంగులై మెలగెడి వారును
భక్తి రసాపగ మునిగిన వారును
శక్తి అపారము కలిగిన వారును

కావలె కావలె అతి నిస్స్వార్థులు
కావలె కావలె అతి పరమార్థులు
కావలె సంఘమునకు అభ్యర్థులు
కావలె మీలోపల వారెవ్వరు?

భూమాతకు భూమిజామాతకు
భూనేతకు భూమిసంజాతకు
భూప్రజలకు భూమిదేవతలకు
భూభువనమునకు కావలె! కావలె!

అట్టివాడు ఆంజనేయు డొక్కడె
గట్టివాడు వాయుపుత్రు డొక్కడె
అట్టి దిట్ట రామభక్తు డెక్కడ
అట్టి జగజెట్టి ఎక్కడ? ఎక్కడ?

గంధమాదనమ్ము పైన
కదళీవన మధ్యమందు
పారిజాత తరువుచెంత
పవనాత్మజు డుండుగాని

ఎక్కడ చూచిన అక్కడె ఆతడు
ఇక్కడ అక్కడ అనరాదాతని
కెక్కడ అవసర మనిపించిన తా
నక్కడ ప్రత్యక్షంబై తీరును!

అహొ! అహొ! మన హనుమంతుడు
చెడుగును త్రోలే అతి ధృతిమంతుడు
శ్రీమంతుడు మన హనుమంతుడు అతి
ధీమంతుడు అతి బలవంతుడు మరి!

శత్రు నాశంకరుడు జన శుభంకరుడు
భక్తికి వశంకరుడు బాల శంకరుడు
అంజనా వరసుతుడు అరి భయంకరుడు
అంజనాచల చరుడు ఆనందకరుడు!

# సంప్రార్థనము

శ్రీవాయుపుత్రాయ! సిత వజ్రగాత్రాయ!
ఆనందదాయ! తుభ్యం నమోస్తు
శ్రీరామభక్తాయ! శ్రితలోకనాథాయ!
ఆర్తావనాయ! తుభ్యం నమోస్తు!

శ్రీసూర్య శిష్యాయ! స్థిర ధైర్య శైలాయ!
అమృత సూనాయ తుభ్యం నమోస్తు!
శ్రీ ధీరలలితాయ! సింధూర తిలకాయ!
అఘ నాశకాయ! తుభ్యం నమోస్తు!

అఖిలదోష హారాయ! తుభ్యం నమోస్తు!
భక్తజన కల్పకాయ! తుభ్యం నమోస్తు!
అవ్యయాయ భవ్యాయ! తుభ్యం నమోస్తు!
భవ్య పవనాత్మజాయ! తుభ్యం నమోస్తు!

అంజనా సుప్రజా! శ్రీఆంజనేయ!
ఆనంద సుందరా! హనుమంత దేవ!
ఉత్తిష్ఠ శుభకరా! సుగుణాలవాల!
ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ ఉత్సాహ శీల!

భువిలోన దివిలోన సృష్టి చక్రములోన
నిను మించు విక్రముడు కలడా?
ఇది నిత్య సత్యంబు ఇది భవ్య భావంబు
వినుమోయి ఓ భూరిబలుడా!

దేవకార్యము వేగ తీర్చగావలెను
భాగ్యకై చీకట్లు పరిమార్చవలెను
నీతి నియమాలను నెలకొల్పవలెను
భ్రాంతితో మనభూమి అలరారవలెను
మేలుకో బాలశివ!
మేలుకో సచివ!

మోములు నిండార పూవివిచ్చినయట్లు
గుమ్మడి పండ్లెన్నో గుట్టగా పడినట్లు
దోసపండ్లూ కోసి రాసిపోసినయట్లు
తూరుపు కొండపై తోపించుచున్నది
మేలుకో బాలశివ!
మేలుకో సచివ!

తూర్పు మలపై వేల్పు తొయ్యలుల్ గుమిగూడి
బంగారు రంగుల రంగవల్లులు దిద్దినారు
పరాగులో అచట హారాశి గీలించి
పంతాలు పట్టి వసంతాలు కొట్టుకొనినారు
మేలుకో తండ్రి మా
మేలుకో తండ్రి!

బింబాఫలము లేక రంభాఫలంబో
సువర్ణరేఖా చూత ఫలంబో
అవినీతి తిమిరాలు హతమార్చ తరణి
తూరుపు కొండపై దీపించుచుండె
మేలుకో తండ్రి మా!
మేలుకో తండ్రి!

శ్రీరామ నామ ప్రచారకుడవు
జయరామ తత్త్వ విశారదుడవు
మంత్ర తంత్ర ప్రసిద్ధుడవు నీవు
మహత్ కార్య సమర్థుడవు నీవు!

నవ వ్యాకరణ పండితుడ వీవు
సర్వ వ్యవహార దక్షుడ వీవు
శత్రుబల సంహారకుడ వీవు
సర్వవిధ సంచాలకుడ వీవు!

శ్రీ అంజనాచల చరుడ వీవు
సాధ్వి అంజన ముద్దుపట్టి వీవు
పవనాతి వేగ ప్రవర్తకుడవు
ప్రమదంబు నిచ్చు సద్వర్తనుడవు!

వజ్ర దంతములతో వజ్ర నఖములతో
వజ్ర కాయముతో విక్రమించావంటె
శత్రు సేనలు నిన్ను శరణు జొచ్చు
లేకున్న రణములో ఓడి చచ్చు!

అరి భయంకరుడవు హరి జయంకరుడవు
బాల శంకరుడవు భక్త కింకరుడవు
సర్వమ్ము కాచెదవు గర్వమ్ము త్రుంచెదవు
పర్వమ్ము కూర్చెదవు సర్వోదయ ప్రభూ!

సుగ్రీవ మంత్రులం దగ్రేసరుడ వీవు
నిగ్రహానుగ్రహ సమగ్ర ధీరుడ వీవు
జీవ స్వభావ విశేష వేదివి నీవు
కైవల్యకర దివ్య కార్యవాదివి నీవు!

మహా మహోద్భూత దివ్యమంత్రాత్మకుడ వీవు
ఆశ్చర్యకర సర్వ యంత్రాత్మకుడ వీవు
ఐహికాముష్మిక వ్యవహార దక్షుడవు
పారలౌకిక శాస్త్ర పండితాధ్యక్షుడవు!

ఆత్మ సంయమ కళా వ్యాపార దక్షుడవు
పరమాత్మ సంస్థిత ప్రబల మృదు వక్షుడవు
మోక్షమ్ము నిచ్చు ప్రత్యక్ష దేవుడ వీవు
రాక్షసుల శిక్షించు సాక్షాత్ శివుడ వీవు

మన్యు సూక్త విశేష ధన్యజీవనుడవు
మున్యంతరంగ సౌజన్య పావనుపాడవు
మంత్రాత్మకుడ వీవు తంత్రాత్మకుడ వీవు
యంత్రాత్మకుడ వఖిల మంత్రీశ్వరుడ వీవు!

లోక కల్యాణమ్ము లోక సంక్షేమమ్ము
శోక నిర్మూలనము నీకార్యములు గదా
ఈ సమయ మేకాంత మెట్లు రుచియించె భువి
ధర్మమ్ము లోపించి ధ్వంస మగుచుండెరా!

వినుము వినుము జన కథనము
క్షణము క్షణము బ్రతుకు భయము
మునులకు మానినులకు స
జ్జనులకు సద్వర్తనులకు

దేశ మధో గతిలో పడె
నాశమె గతి యగుచుండెను
దేశమాత కన్నీళ్ళకు
లేశమైన విలువ లేదు!

అవినీతిది రాజ్యమాయె
అవమానము నిత్యమాయె
భువి సత్యము పూజ్యమాయె
పవమాన కుమార! లెమ్ము!

రాక్షసమ్ము పెరిగి పోయె
రక్షణమ్ము తరిగి పోయె
కక్షయు కార్పణ్య మంత
రిక్షమ్మున కెగదన్నెను!

మాన్యాలు పలుదోపిడీలు
ప్రత్యుదయము ప్రత్యక్షము
సత్యము మాట్లాడిన ప్రా
ణ త్యాగమె ప్రాప్తించును!

మహిళల చెరబట్టుట మరి
మహి దేవుల బాధించుట
మహి అహితము లొనరించుట
విహితములట విన్నావా!

మహిషాసురు తలదన్నెను
మహితాత్ముల కాల రాచె
పాహి! పాహి! యని యేడ్వగ
ఇహిహీ యనె రాక్షసుండు!

బలవంతుడు బలహీనుల
బాధించుట అలవాటయి
ఏక్షణ మేమౌనో యని
ఎప్పుడు భయమే భయమే!

జయ! జయ! సద్వరదాయక!
జాతీయ మహా నాయక!
ఆంజనేయ! అప్రమేయ!
అంజలి ఘటియింతుమయ్యా!

ఒకరాజు భార్యకే ఇట్టి
ఆపదలు ఒనగూడి నట్టి
స్థితిలోను దేశమున స్త్రీల
సంగతులు ఏమి కావలయు?

వికృత చేష్టలు చేసి జనుల
వెతలను బెట్టుచున్నారు
సకలమ్ము దోచి భూప్రజల
పీడించి వేయుచున్నారు!

హరినామ మన్న వారలను
సైతమ్ము హత మార్చినారు
కరుణించు మన్న ఆర్తులను
సైతమ్ము ఖండించినారు!

తరుణీ జనమ్ము నవమాన
పరచుటకు వెనుదీయ లేదు
హరి హరీ! వినలేము వారు
గావించు అతి ఘోరములను!

ధన మానముల కింత రక్ష
అనునదే ధరణిలో లేదు
మునులకు ఘనులకు శాంతి
అనునదే పుడమిలో లేదు!

గనులందు వనులందు వారి
వశమింత కానిదే లేదు
అనిలాత్మజా! వాని దౌష్ట్య
మున కింక అంతమ్ము లేదు!

పుష్పకమ్ముల నెక్కి గగన
మండలము పొగరెక్కి తిరిగి
పుష్ప సదృశలైన స్త్రీల
చెరబట్టి పొందు నాశించు!

గీష్పతిం తలదన్ని సకల
దివిజులను గెలిచి ఆనంద
బాష్పముల్ తొణుకాడ విఱ్ఱ
వీగుచును వాగుచున్నాడు!

పాహిమాం! పాహిమాం! భక్త
లోకైక బంధో! కపీంద్ర!
త్రాహి రక్షస్వమాం ధర్మ
దీక్షా పరాయణా దేవ!

పాహినీ ప్రత్యూష: కమల
పూజిత పాదారవిందా!
దేహి సన్మంగళం దేవ
అంజనా దేవీ కుమార!

నూరు యోజనాలున్న మున్నీరు నీకు
అంగకును రాక గోష్పాదమంత యౌను
భాను బింబమ్ము అయ్యె బింబాఫలమ్ము
అద్భుతానంద సుందరా! అంజలింతు!

# మాహేంద్రము

బయలు దేరెనమ్మా కపీశ్వరుడు
బయలు దేరెనమ్మా!
భయము లేదు తల్లీ మంచికి
జయము కలుగు మళ్ళీ!

సకల శుభములు మనకు
సమకూర్చగా వేగ
ఇక భయము లేకుండ
ఇలను సంరక్షించ బయలు దేరెనమ్మా!

బంగారు కాంతుల
రంగారు మేనితో
సింగార మొలికించు
సిందూరపు మోముతో బయలు దేరెనమ్మా!

నిగనిగల్ మెయినింప
మృగరాజ ఠీవితో
చిన్మయానందుడై
శ్రీ ఆంజనేయుండు బయలు దేరెనమ్మా!

వజ్ర కాయము తోడ
వజ్రి సంతోషింప
వజ్ర సంకల్పుడై
వాయుపుత్రుడు వేగ బయలు దేరెనమ్మా!

దిక్కు లొక్కుమ్మడిగ
పిక్కటిల్లంగ మరి
ఉక్కు మీరిన కాంతి
రెక్కలను విప్పంగ    బయలుదేరెనమ్మా!

పాద ఘట్టన చేసి
పండ్లు పట పట కొరికి
పగవారి పైకేగు
పరశురాముడు వోలె    బయలుదేరెనమ్మా!

దక్షాధ్వరమ్మునకు
తండ్రి ఆజ్ఞను బూని
చను వీరభద్రుని ప్ర
చండ రూపము వోలె    బయలుదేరెనమ్మా!

త్రిపురములు దహియించ
త్రినయనుం డేకముగ
అత్యుగ్రమూర్తియై
అరుదెంచు చున్నట్లు    బయలుదేరెనమ్మా!

గిరి పైకి హరి వోలె
అరి పైకి హరి వోలె
కరి పైకి హరి వోలె
పరువెత్తి శిరమెత్తి    బయలుదేరెనమ్మా!

శిరసెత్తి ఒకసారి
గిరిపైన విహరించి
కరమెత్తి ఒకతూరి
పరికించి పరికించి    బయలుదేరెనమ్మా!

గ్రహములను కొలిచి అను
గ్రహము పూర్తిగ బడసి
వేద విదులకు మ్రొక్కి
వెన్వెంటనే హనుమ

సీతాన్వేషణ గావించుటకై
శ్రీరాముని పని సాధించుటకై
సుగ్రీవాజ్ఞను తలదాలిచి పం
క్తిగ్రీవు డదరగ కపికులశ్రేష్ఠుడు

నాలుగు దిక్కులు వెతకి వచ్చుటకు
నేతకు సీతను వెతకి తెచ్చుటకు
నీతిని ఇలలో పాదుకొల్పి అవి
నీతిని లోతుగ పాతిపెట్టుటకు

నల నీలాదుల మంత్ర బలముతో
కల కంఠంబుల కలరవములతో
సిద్ధ సాధ్య గంధర్వ గణముతో
వృద్ధ వరేణ్యుల ఆశీస్సులతో

సుందర సురభిళ సరోవరంలో
సుందరమౌ వర గంధ గజంలా
అందరి కానందము సమకూర్చుచు
అనిలజు డమితానందప్రదుడై

పాద ఘట్టనము చేస్తున్నాడు!
పారావారము చూస్తున్నాడు!
ఉత్సాహమ్మును భజిస్తున్నాడు!
తాత్సర్యమ్మును త్యజిస్తున్నాడు!

శత యోజనములు సాగరపూరము
సాలోచనగా తలపంకించెను!
స్వాంతములో శ్రీ రాముని తలచెను
సాగరమొక కాల్వగ అనిపించెను!

ఆగాంభీర్యము చూస్తూ చూస్తూ
అంబుధి కలవర పడసాగినదీ
ఆధైర్యమ్మును చూస్తూ చూస్తూ
అద్రి మహేంద్రము అల్లలాడినది!

ఆ యౌన్నత్యము అందగ లేకను
ఆకాశము తెలతెల్లపోయినది
దిక్కులకే మరి దిక్కును తోచక
బిక్క మొగాలను పెట్టుకొన్నవి!

అనుప మోపాసనా బలమ్మున అభీష్ట
సురవరేణ్యుల ప్రత్యక్షపరచుకొనియు
ఆంజనేయుండు భక్తితో అంజలించి
శుభ వచస్సుల నిట్లని అభినుతించె!

"ఓసూర్యదేవా! మహోత్తేజ కీర్తి
ఓఇంద్రదేవా! మహోత్సాహ మూర్తి!
ఓమహాదేవా! మహోపద్రవాంతా
ఓప్రజానాథా! మహోన్నత వసంతా!

ఓం నమస్తే దేవ దేవా!
ఓం నమస్తే విశ్వభావా!
ఓం నమస్తే పుణ్యమూర్తీ!
ఓం నమస్తే ప్రశమితార్తీ!

వాయుపుత్రుడ నేను వానరోత్తముడ
అంజనా వరసుతుడ అందరికి హితుడ!
సుగ్రీవ సేనలో అగ్రేసరుడను
రామకార్యము సేయ ప్రతిన బట్టితిని!

సకల దిక్పాలకులు సకల దేవతలు
శుభవీక్షణములతో అభయంబు నిండు
మీ శుభాశీస్సులను మీ కటాక్షములు
అర్థించుచుంటి అభ్యర్థించుచుంటి!"

"ఓకపీనాం కపీ! మహత్ చిరంజీవీ!
ఓ అభ్యుదయ రవీ! దైత్యపర్వత పవీ!
విజయోస్తు! విజయోస్తు! విశ్వ శుభమస్తు!
విజయోస్తు! విజయోస్తు! సర్వ శుభమస్తు!

హేధీర హనుమాన్ హేవీర హనుమాన్
హేదివ్య మతిమాన్ హేభవ్య ధృతిమాన్!
ఓసత్య శుచిమాన్ ఓనిత్య రుచిమాన్
ఓభవ్య బలవాన్ ఓభక్త హనుమాన్!

జయ వీరహనుమాన్!
జయ ధీరహనుమాన్!
శ్రీరామ నామమే శ్రీరామ రక్ష!
శ్రీరామ నామము సర్వజగద్రక్ష!

నీదీక్షయే నీకు శ్రీరామరక్ష!
నీతల్లి దీవెనే జయరామరక్ష
నీతండ్రి ధ్యేయమే శ్రీరామరక్ష
నీచిత్తశుద్ధియే జయరామరక్ష!

శ్రీరామ మంత్రమే శ్రీరామ రక్ష!
శ్రీరామ చింతనే జయరామ రక్ష!
నీ ధర్మరక్షణే నీకాత్మ రక్ష!
నీ శిష్టవర్తనే నిత్యంబు రక్ష!

ముప్పొద్దు గావించు మునుల తపస్సులు రక్ష
వినువీధి వాలించు ఘనుల పయస్సులు రక్ష!
పతివ్రతా రత్నాల పరమ మనస్సులు రక్ష
మతిమంతులైన పండితుల వచస్సులు రక్ష!

రామకార్యము నందు బ్రహ్మాది దేవతలు
సాయమై నీవెంట సాగి వచ్చెదరు!
సర్వ వేళల నిన్ను సంరక్షణము చేసి
సర్వ సన్నద్ధులై జయము కూర్చెదరు!

జయ జయ నినాదాలు జయమహా వేదాలు
సకల దిక్కుల నుండి సర్వ విప్రుల నుండి
మారుతమ్ములు రేగి మాఱు మ్రోయగసాగె
పొంగసాగెను భూమి బ్రోవసాగెను స్వామి!

వాయుదేవుడు పెక్కు వరము లిచ్చాడు
సూర్యదేవుడు కాంతి శోభ కూర్చాడు
ఇంద్రాది దేవతలు భద్రమన్నారు
చంద్రాది గ్రహములు చక్క నిలిచాయి!

ఆంజనేయ స్వామి అంజలిని ఘటియించి
ఆనందము భజించి అమృత స్వరూపుడై
ఇంత వాడంతలో ఎంతో పైకెదిగాడు!
ఆకాశ వీధి కల్లంత వాడైనాడు
అంబుధమ్ములపైని అంతవాడైనాడు!

అమృతాంశు రుచి మించి అంతవాడైనాడు
అర్కమండల మంటి అంతవాడైనాడు
సత్య మంత్రైనాడు నిత్య మంత్రైనాడు
సాహిత్య మూర్తియై సర్వత్ర నిండాడు!

ఆనందమూర్తి జగ మంతవాడైనాడు
పరమాణువుల నిండి బ్రహ్మాంత యైనాడు
ఆంజనేయ స్వామి అప్రమేయ స్వామి
ఆనందమయమూర్తి అతి సుందర సుకీర్తి!

ఉప్పొంగి ఉప్పొంగి ఉప్పరము ఎగిశాడు
ఉత్సాహ మెక్కుడై ఊరువుల్ చరిచాడు
భయదముగ ఒకసారి బాహువుల్ చరిచాడు
ఔర ఔరా యంచు ఔడు గరిచాడు!

పాద ఘట్టన చేసి పాదమ్ము ధట్టించి
ఆదిశేషుని ఫణము లదర గొట్టాడు
పాద ఘట్టన చేసి పాదమ్ము ధట్టించి
కుల నగాల కుదుళ్ళు కూల్చి వేశాడు!

పాద ఘట్టన చేసి పాదమ్ము ధట్టించి
దిగ్గజంబుల మదము దింపి వేశాడు!
పాద ఘట్టన చేసి పాదమ్ము ధట్టించి
ఉదధి హద్దులనెల్ల చెదర కొట్టాడు!

పాద ఘట్టన చేసి పాదమ్ము ధట్టించి
పాథోధి జంతువుల భయ పెట్టినాడు
పాద ఘట్టన చేసి పాదమ్ము ధట్టించి
కొండ శిఖరమ్ములను పిండి చేశాడు!

పాద ఘట్టనమ్ము వలన పర్వతాంతరములు పగిలి
ఖండములయి ఖండమ్ములు పిండై అట్టడుగున గల
గండ శిలల నుండి జలము తుండమ్ముల జిమ్మసాగె!

పాద ఘట్టనమ్ము వలన పర్వతాంతరములలోని
బంగారము వెండిగనులు పగిలి పగిలి సెలయేళ్లై
పారినట్లు తళతళ మనె కారినట్లు జలజల మనె!

పాద ఘట్టనమ్ము వలన పర్వతాంతరముల నలిగి
పాప జాతి విషముగ్రక్కి బండలపై కాట్లు వేయ
భగభగ మండెను బండలు సెగలుగ్రక్కి అరిగుండెలు!

పాద ఘట్టనమ్ము వలన పర్వతాంతరములలోని
మణిశిలలును పగిలి పగిలి మయూఖములు రగిలి రగిలి
మండుచున్న అగ్నివోలె మదికి భ్రాంతి కలిగించెను!

పాద ఘట్టనమ్ము వలన పర్వతమ్ము అదిరిపోవ
హార నూపురాలు జార పారిపోవ సాగినారు
విద్యాధర వర కాంతలు వినువీథికి మినువీథికి!

పాద ఘట్టనమ్ము వలన పర్వతమ్ము కదిలిపోవ
పొదరింట్లను మదిరాక్షుల అధరమ్ముల సుధలు ద్రావు
కిన్నర కింపురుష జనులు తెన్నులు విడి పారినారు!

పాద ఘట్టనమ్ము వలన పర్వతమ్ము చెదిరిపోవ
వరుని విడచి వధువు పర్వె వరుడు వధువు వేరు వేరు
దారులందు ఏరులం దెడారులందు పరచినారు!

విష్ణుపదము నుండి వియత్తలము నుండి
విషయమును గ్రహించి దేవ గంధర్వులు
వింతగా మారుతి విక్రమించుట కని
సంతసించినారు చింత దొరగినారు!

రామకార్య సాధనమని స్వామికార్య యత్నంబని
జయం పలికినారు మునులు భయం వీడినారు జనులు
అప్సరసలు ఆడినారు ఆనందము పొందినారు
గంధర్వులు పాడినారు సింధూరము చల్లినారు!

శ్రీరామదూతం శిరసా నమామి
విశ్వవిఖ్యాతం శిరసా నమామి!
అంజనాపుత్రం శిరసా నమామి
సుగ్రీవమిత్రం శిరసా నమామి

పరిభూత పాపం శిరసా నమామి
సంభగ్న దైత్యం శిరసా నమామి!
ప్రత్యక్ష సత్యం శిరసా నమామి
కైవల్య మూలం శిరసా నమామి!

అంచు దేవతల్లె అప్పుడు
అమగులంబడి వేసినారు
అంతటా ఆంజనేయుండు
ఆత్మావలోకనము చేసి

స్వార్థమ్ము మది మలేపినాడు
సర్వేశు మది నిలిపినాడు
జయలక్ష్మి ధ్యానించినాడు
పయనమ్ము కోరినాడు!

సాగరోల్లంఘనకు సర్వ సన్నద్ధుడై
సాక్షాత్కరించి ప్రేక్షకుల కొక్కొక్క రీతి
భావంబరము లందు బహు రూపధారియై
వాయుదేవుని సుతుడు వర్ధిల్లుచున్నాడు!

పక్షియై పైకెగిరి పరికించి దిశలన్ని
పర్వతాకారుడై సర్వత్ర ఆతడై
అగ్నిశిఖ దీప్తితో ఆకాశమంటుకొని
వాయుదేవుని సుతుడు వర్ధిల్లుచున్నాడు!

ఆషాఢ మేఘుడై ఆహ్లాదకారుడై
క్షితిజమ్ము పైనిండి చెలువమ్ము నెగజిమ్మి
సర్వ గుణాభద్రుడై చల్లగా కనుపించి
వాయుదేవుని సుతుడు వర్ధిల్లుచున్నాడు!

ఓంకార మొనరించి క్రేంకారమును చేసి
వాలమ్ము పైకెత్తి ఫాలమ్ము విప్పార్చి
బాహువుల్ మునుసాచి పాదాలు కదలేసి
వాయుదేవుని సుతుడు వర్ధిల్లుచున్నాడు!

తన ముష్టిని బిగించి తన దృష్టిని లగించి
చెవిదోయి నిక్కించి శీర్షమ్ము పైకెత్తి
వాయువును కుంభించి స్నాయువుల నుబ్బించి
వాయుదేవుని సుతుడు వర్ధిల్లుచున్నాడు!

వార్ధి తరగలు చూచి వార్ధి చివరకు చూచి
లంఘనోద్యుక్తుడై లంకాధిపతి గుండె
లక్ష్యమ్ముగా చూచి రామబాణము వోలె
వాయుదేవుని సుతుడు వర్ధిల్లుచున్నాడు!

సద్భాషణములు
సద్భూషణములు
జయ ఘోషమ్ములు
హయ హేషమ్ములు!

అళి ఝుంకారమ్ములు
గజ ఘీంకారమ్ములు
ఋషి ఓంకారమ్ములు
భట భాంకారమ్ములు!

తనువెల్ల పువ్వులై
ధరణీ ధరము నాడు పుల్కరించినది
పువ్వు పువ్వూ కూడ
పుష్పాతుల గమిఅంత చిల్కరించినది!

ప్రతిప్రాణి ప్రత్యణువు
అతి మోదమున ఎంతో పరవశించినది
హానుమ రూపము చూచి
అవినీతి కడుభీతి వణికి పోయినది!

చెట్టు చెట్టున
కోటి కొమ్మల్లు విస్తరించాయి
కొమ్మ కొమ్మన
కోటి పువ్వుల్లు విచ్చుకున్నాయి!

పువ్వు పువ్వున
కోటి నవ్వుల్లు వెల్లివిరిశాయి!
నవ్వు నవ్వున
కోటి దివ్వెల్లు నివ్వటిల్లాయి!

# సముద్ర తరణము

ఆంజనేయ స్వామి అబ్ధి లంఘన సేయ
కుప్పించి పైకెగయు నప్పుడుప్పొంగ భువి
తనబిడ్డ మేలుకై చనుచున్న బంధువని
తనువు తా నుబ్బించి తానెత్తుకొని లేచి
హనుమ! చను మన్నటుల కనుమంత అన్నటుల!

ఆంజనేయస్వామి అబ్ధి లంఘన సేయ
ఆ లంఘనోద్ఘతికి ఆనందమున ఆచటి
గిరిపైన వృక్షాలు గిరగిరా తిరిగాయి
ఆత్మ ప్రదక్షిణ మ్మతి భక్తితో చేసి
మాతల్లి గొనివచ్చి మాకిమ్ము అన్నటుల!

భవ బంధములు వీడి పరమాత్మతో జేర
సాగివచ్చిన మహా సద్భక్తతతి వోలె
విలపించి విలపించి విడలేక వివశులగు
ఆత్మ బంధువులట్లు అటు ఒరిగి పడెకొన్ని!

ఆ గమన వేళలో అంబునిధి కెరటాలు
అద్రి అంతగా లేచి హర్షమ్ము ప్రకటించె
ఆ గమన వేగమున అంబునిధిలో పడెను
వ్రేళ్ళతో పెళ్ళగిలి వృక్షాలు మరికొన్ని!

రామ చంద్రుని వీడి ప్రాణాలు వదలిన
దశరథేశ్వరు నాత్మ తత్త్వమ్ము మరిపించి
ఆ గమన వేగమున కబ్ధిలో నీరమ్ము
పాయగా చీలి పెను పడవనే సృజియించె!

ఆ గమన వేగమున కఠిన పాషాణముల్
రాజ సైనికులట్లు రాసాగినవి నిక్కి
ఆ గమన వేగమున కబ్ధియడు గగుపించె
జనకరాజ తనూజ తనలోన లేదంచు
చిత్తమ్ము అంబునిధి చీల్చి చూపిన యట్లు
అన్వేషకునకు స్వగృహమ్ము చూపిన యట్లు!

ఆ గమన వేగమునకా తరంగాలలో
పై కెగురుచున్నట్టి బహు మత్స్య జాతులును
దివి పైని వ్రేలాడు దేవతా వస్త్రాల
చిత్ర కాంతుల వోలె నేత్రముల కగుపించె!
అబ్ధి అట్టడుగునం దపురూపముగ నున్న
జీవములు రత్నములు చిత్రముగ మెరసినవి!

ఆంజనేయస్వామి అతి సాహసమ్ముతో
ఆకాశ మార్గాన అరుదెంచుచున్నపుడు
అరులకు భయంకరుడు నరులకు జయంకరుడు
ఒక మాటు సూర్యుండు ఒక మాటు చంద్రుండు!

వార్ధి నాపోశనము పట్టగా నుంకించు
ఆల అగస్త్యుని వోలె నొకమాటు అనిపించు
పన్నగము తన్నుకొని పైకెగురు చున్నట్టి
వైనతేయుని రీతి వాయుజుడు అగుపించు!

వాలమ్ము పాదాల వద్ద సారించంగ
కాలి గోళుల నడుమ గట్టిగా నహి నిడిన
గరుడుని విధమ్ముగా కనుపించసాగాడు
ఆ మహాబలయుతుడు ఆ ప్రభంజన సుతుడు!

## సుందర మందారము

సుందరుడు ఆనంద
కందరుడు వానరుడు
ముందునకు సాగిపోతున్నాడు మును
ముందునకు నాగిపోతున్నాడు!

భగ్గున మండిన అగ్నిమూర్తి వలె
జగమే నిండిన విష్ణుమూర్తి వలె
రెక్కలు చాచిన పర్వతమ్ము వలె
దిక్కుల మెరిసే ఇనబింబము వలె!

నడచుచున్న ఒక మహా నటము వలె
పడగను విప్పిన అల వాసుకి వలె
కడలి లోపలి తిమింగలము వలె
అడవి లోపలి మృగాధిపము వలె!

ఇభముపై గల హరికిశోరము వలె
నభము పై కల రాజహంస వోలె
మనము లోపలి తీవ్ర భావము వలె
వనము లోపలి మయూరమ్ము వోలె!

పవి వోలె ప్రళయోగ్ర రవివోలె వని కాల్చు
శిఖి వోలె షణ్ముఖుని శిఖి వోలె అగుపించు!
ఆ ప్రభువు బాహువులు అద్రి శిఖరాలపై
పడగ విప్పిన నాగు పాములై కనుపించు!

ఆ స్వామి నేత్రాలు అమిత కాంతులు చిమ్మ
ప్రళయాగ్ని గోళముల భంగి భగ భగ లాడు
ఆ స్వామి నేత్రాలు అగుపించు నంతలో
చంద్రికల్ విరజిమ్ము చంద్ర బింబము లట్లు!

ఆ హనుమ వదనమ్ము యమరాజ సదనమై
అతి భయంకరముగా అగుపించు అసురులకు
ఆ హనుమ వదనమ్ము అతి తామ్ర వర్ణమూ
అరుణారవిందమై అగుపించు అమరులకు!

అవీర లాంగూల మతి భీంకరంబైన
యమ పాశమై తోచు అరి సమూహమ్మునకు!
ఆవీర లాంగూల మతి సుందరంబైన
ఇంద్ర చాపము వోలె ఇంపు సొంపులు గుల్కు!

లాంగూల మధ్యమున రామచంద్రుని దూత
పరివేష వలయమున భాస్కరుడుగా తోచు!

వీరాంజనేయుండు వీరావతారుడై
సాగరోల్లంఘనము సాగించు సమయాన
క్షణమునకు ఒక రీతి కనిపించు ఘనులకు
క్షణమునకు ఒక రీతి కనిపించు మునులకు!

మంచి వారలు జూడ మంచిగా కనిపించు
చెడ్డ వారలు జూడ చెడ్డగా కనిపించు
నరులకా మూర్తి శ్రీహరిలాగ అనిపించు
అరులకా రూపు ఘుర హరుడులా గనిపించు!

ఉత్తరపు దిశనుండి ఉరుములా వచ్చేటి
ఉల్కలాగున్నాడు శత్రువులకు
చిల్కలాగున్నాడు స్నేహితులకు!

ఆకాశ వీధిలో అంబుదమ్ములలోని
అశనిలాగున్నాడు అసురులకును
ఆశలాగున్నాడు అమరులకును!

# మైనాకము

అతి మహస్సుతో రవివోలె అబ్ధి పైన
పరగు వీరాంజనేయ రూపమ్ము జూచి
సంతసము చెంది అతిథి పూజల నొనర్ప
అబ్ధి మైనాకు పిలిచి మాట్లాడె నిట్లు

"మైనాక గిరిరాజ! మాననీయ సుతేజ!
మారుతాత్మజు డతడు మనకు దగ్గరవాడు
రామ దూతగ నేడు లంక కేగుచు నుండె
ఎదురేగి ఆతిథ్య మీవలెనురా మనము!

సాగరులు నన్నిట్లు చక్కదిద్దినవారు
సగర వంశీయుడా సద్గుణుడు రాముండు
రామ కార్యార్థియై సామీరి జనుచుండె
సత్వరమ్ముగ వెళ్ళి సత్కార మొనరించు!

వజ్రాయుధము తోడ వాసవుం డొకనాడు
వరుసగా పర్వతపు పక్షముల్ ఖండింప
పవను డిట నినుదాచి ప్రాణభిక్షను బెట్టె
ఆతండ్రి బిడ్డ ఈ ఆంజనేయస్వామి!

ఉపకృతికి ఉపకార మొనరింపవలె జీవి
మహిని ఉపకారమ్ము మరచి పోవుట తగదు
అతిథి సత్కారమ్ము ఆచరించుట మేలు
స్తుతి చేసినంజాలు తొలగురా పాపాలు!

ఆకాశ వీధిలో రాకాశశి విధాన
అందాలు చిందించె ఆంజనేయస్వామి
అంతెత్తు చేయెత్తి అందుకో జాలరా
ఎంతెత్తుకైన నీ వెగురగా గలవురా!

నీలాల నింగిలో నీశరీరము పెంచి
నిండు సంతోషముతొ నీశిఖరపీఠమున
పవననందను పిలిచి విశ్రాంతి నొసగరా!
పరమ పావను నిలిపి ధన్యతను పొందరా!

చేయదగిన పనిని చేయకుండిన తప్పు
చేయదగని పనిని చేయుచుండిన ముప్పు
నిన్నంటు ఆ మూర్తి నీ పాప జాలమ్ము
నిప్పంటుకొనినట్లు నిర్జింప బడిపోవు!

అతిథ్య మొనరించు టతి ముఖ్య ధర్మమ్ము
ఆప్తుండు అమృతుండు అనిలాత్మజుడు గిరీ!
శ్రీరామ దూతరా! శ్రీరుద్రు నంశరా!
ప్రియమైన హితుడురా! జయమిచ్చువాడురా"

మైనాకు డంతట మై పెంచినాడు
అందమ్ముగా నింగి కంటి నిలిచాడు
ఆ హనుమ నీక్షించి ఆనంద మొంది
ఆ శౌర్యవారాశి కంజలించాడు!

రమణీయ మహనీయ రత్న హారాలతో
పూజార్హ మగు గంధ పుష్ప హారాలతో
పరిమళ పరిఫుల్ల పారిజాతాలతో
వర్ణనీయ మనోజ్ఞ వారిజాతాలతో

నిర్మల భావమ్ము నిండారు భక్తితో
మునిజన ప్రియమైన పూర్ణానురక్తితో

మానసానందయుత మంజులాసక్తితో
స్తుతిచేసి నతిచేసి 'గతినీవె' అని వేడి

మధుర మంజుల ఫణితి మైనాక గిరిరాజు
మాటలాడగ సాగె మారుతాత్మజు తోడ

"ఓ కరుణాకర! ఓ వానరవర!
ఓ పవమాన కుమారా! రారా!

రఘువర దూతా! కపిజన నేతా!
వరదాభయకర దాతా! తాతా!

ఓ ఉపకార ధురీణా! ఓ మునిజన నుత సుగుణా!
ఓ జనకల్యాణ చణా! నానా శాస్త్ర ప్రవీణా.

వందనమ్ములు వందనమ్ములు అంజనా వరనందనా!
స్వాగతమ్ములు స్వాగతమ్ములు భక్తజనగణ చందనా!

మంగళ కర కర్తవ్య పరాయణ!
మంజుల రామనామ పారాయణ!

కొండల రెక్కలు ఇంద్రుడు నరకగ
నిండు కూర్మి నను బ్రోచెను నీపిత!

రాఘవు పూర్వులు కడలిని త్రవ్వగ
సాగర నామము దాల్చె సముద్రము!

సగర వంశజుడు జయరాము విభుడు
ఆ ప్రభుదూతవు అభినందనములు!
వాయుపుత్రుడవు రామభక్తుడవు
వందనీయుడవు వచ్చితివి ఇపుడు!

ఆతిథ్యమ్మును అందుము హనుమా!
ఆప్యాయమ్ముగ మమ్ముల గనుమా!
కాలూని ఈశిఖరి కరుణించు హనుమ!
కాసంత ఈసుఖము గైకొనుమ హనుమ!"

అట్లు మైనాక శైలమ్ము ప్రార్థనమ్ము
సేయగా దయానిధి ఆంజనేయ విభుడు
సంతసమ్మున పలికె - వత్సలత - కరుణ
ప్రేమ - హృదయమ్ములోన ముప్పిరి గొనంగ

"నీ ప్రేమయే చాలు నిండెను మనస్సు
నీ హృదయ మెరిగితిని నీకు ఆశీస్సు!
ఆతిథ్య మర్చనలు అందుకున్నట్లె
ఖ్యాతితో నీవింక అలరారు మిట్లె!

కడలికిని నామాటగా చెప్పవోయి
లబ్ధమైనది వారి లలిత లాలనము
ఆతడు సముద్రుడే దయాసముద్రుండు
మణులకే నిధికాదు గుణనిధి అతండు!

తండ్రి వలె నీవు కడు ధర్మ వీరుడవు
నియమముల నెరిగిన నీతి కోవిదుడవు
కుల గోత్రములు నీవి కొనియాడ తగును
నీవర్తన మొనర్చె నిండు సంతసము!

దీపమున్నప్పుడే దిద్దవలె నిల్లు
దేహబల మున్నపుడె దేవపరిచర్య
సలుపవలె యానమ్ము వెలుగులున్నపుడె
కలిగె సంతోషమ్ము కలసికొన నిన్ను!

జారవిడిచిన క్షణము కోరినా రాదు
మంచిమాటల నెపుడు మరచి పోరాదు
జాగు సేయగరాదు స్వామి కార్యమ్ము
రామ కార్యము ప్రజా క్షేమ కార్యమ్ము!

దీక్షతో జీవించు దేశ భక్తుండు
హింసలు వినోదాలు విడనాడవలెను
దేవ పూజలు సేయు దేవ భక్తుండు
భోగ భాగ్యాలేవి ముట్టుకోరాదు!

నామమ్ము జపియించు రామభక్తుండు
ప్రజ నుండి కానుకలు గ్రహియింపరాదు
జన సమూహము నుండి సాధనా పరుడు
ఆదరము సత్కార మాశించరాదు!

ప్రణవమ్మునాసించు పరమ భక్తుండు
దాసభావముతోడ తనరారవలెను
ఫలసంగ కర్తృత్వములు విడుచు ఘనుని
ఏ కర్మ తతులునూ బంధింపలేవు!"

అని మహాబలపుత్రుడా అద్రి సుతుని
హస్తమున తట్టి ముందుకు అరుగసాగె
మాననీయులు కార్యక్రమాలలోన
ఎట్టి మార్పును కూడ సహింపలేరు!

# సు ర స

గగన మండలమ్ము పైన గమించు మారుతి కనుగొని
'శ్రీమంతుడు ధీమంతుడు శ్రీరాముని దూత!' యనిరి
పురుషులు కింపురుషులు మరి సురలు నరులు వానరులును
ఆనందము ఆశ్చర్యము అనుభవించినారు మిగుల!

కడలి పైన వెడలుచుండె నడి ఏటను పడవ పోలె
వడివడి జను సవ్వడి వలె పరువెత్తెడి ఒకగిరి వలె
విష్ణువెక్కు గరుడునివలె విధిని మోయు హంస పోలె
షడ్వదనుని నెమలి పోలె ఆకసమున అరుగుచుండె!

రంగు రంగుల మేఘరాజాల మధ్యలో
రవిపోలె నున్నాడు పవి పోలె నున్నాడు
కాంతి సంవర్ధనుడు గమనమ్ము సాగించె
అలుపు సొలుపులు లేని ఆంజనేయస్వామి!

అంతలో దేవతలు హనుమను పరీక్షింప
కాంత సురసను పంపి కాంచసాగిరి పైన
మంచి వారికి పరీక్షా? త్యాగమే మది
నెంచు వారికా శిక్షా? జగతిదే వింత?

శాపిడి వల్లనే రత్నమ్ము రాజిల్లు
పటు పరీక్షల వలన భక్తుండు తేజరిలు!
ఆటంకముల నెవ్వ డధిగమించునో వాడె
అసమాన దీప్తితో యశమంది పెంపొందు!

ప్రతిబంధకము వేళ అతిలోక ధైర్యమ్ము
చూప గల్గిన వాడె శూరుడై వెలుగొందు
రామదూతను మ్రింగ రాక్షసి వలె వచ్చి
కామరూపిణి సురస కఠినోక్తులను పల్కె

"కదలనీయక బట్టి కబళించెదను నిన్ను
వదిలించుకొనలేవు వాయునందన! నన్ను
ఓ ఆంజనేయ! నా ఉదరమ్ములో త్వరిత్తు
శోఘ్రమ్ముగానావు ఉండు మ్రింగెద" ననెను

ఆ క్షణమె యోచించి ఆమాట తీరులో
దాగియున్న రహస్య తత్త్వమ్ము గనినాడు
ఆమె పల్కుల పైకి అనిపింప నటువంటి
ఆర్ద్రత తళుక్కుమనె ఆత్మ మారదు గదా!

ఆమె పల్కుల కపుడు అంజనా వరసుతుడు
రామచంద్రుని తలచి రాక్షసికి అనె నిట్లు
"ఓయమ్మ నేనెవరినో కాదు శ్రీరామ దూతనే
మాయావి రావణుడు మాయగా గొనిపోయె సీతనే!

ఆ తల్లి జాడెరిగి అధిపునకు చెప్పి వచ్చెదనమ్మా
ఆపనియు కాగానె ఆహార మయ్యెదను వినవమ్మా!
ఆయమ్మ లోకాలకే యమ్మ ఆలక్ష్మినే ఎరుగవా!
ఆ తండ్రి లోకాలకే తండ్రి ఆవిష్ణునే ఎరుగవా!"

ఆ మాటలు రాక్షసి వినకున్నది
ఆ రాక్షసి కాకలి యగుచున్నది
ఆకలితో కేకలు పెడుతున్నది
రాకాశికి లోకేశుల భయమేటికి?

సటనమ్మున ఏమాత్రము
పటుశక్తులు జారరాదు
దేవకార్య సంఘటనము
భావి యశఃఫల సూచన!

పెరుగుచున్నది సురస వదనము
పెరుగుచున్నది హనుమ దేహము
మరియు పెంచెను సురస గళమును
మరియు పెంచెను హనుమయున్!

పెరిగి పెరిగీ యోజనమ్ముల
వరకు పెరిగెను సురస వదనము
పెరిగి పెరిగీ భూ నభమ్ముల
వరకు పెరిగెను హనుమయున్!

ఒకరి కొక్కరు తగ్గకుండిరి
ఒక్కరును తల ఒగ్గకుండిరి
ఎవరు ఎవరిని మించిపోదురో
అని భయం పడిరి సురల్!

లిప్తలో హనుమంతు డప్పుడు
లీలగా వ్రేలంత వాడయి
సురస వదనము జొచ్చి వచ్చి
గరువ మెప్పుడు తగదనెన్!

కలికి అట్లే నోరు తెరచెను
నిలిచి పోయెను మూగవోయెను
బొమ్మ అయ్యెను మూర్ఛపోయెను
సొమ్మసిల్లి పడెన్!

దెబ్బతో దయ్యమ్ము పారెను
తెలిసివచ్చెను అసలు సంగతి
మాయ విడివడి నిజము వెలువడె
మాటలాడె సిటుల్!

"నాయనా! నీవేగు కార్యము
న్యాయమైనది జయము నీదే
నిను పరీక్ష ఒనర్ప పంపిరి
నను సుర ప్రముఖుల్!

నను క్షమించుము సుస్వరూపా!
నాగమాతను విశ్వదీపా!
నిను దివిజ శక్తులు సైతము బం
ధింప జాలవురా!"

సురసకు సంతోషము కలిగించెను
సురలకు సందేహము తొలగించెను
నరులకు వానరులకు ముదమయ్యెను
అరులకు దీర్ఘాయువు కరువయ్యెను!

వాయు బాణ మనోగతుల
వైనతేయ మార్గమందు
వనధిని లంఘించసాగె
గుణనిధి అనిపించసాగె!

సుమవృష్టి కురిపించె సురవధూ బృందమ్ము
జయ ముచ్చరించినది సన్మునుల బృందమ్ము
ఘన మండలము పులుముకొనె క్రొత్త అందమ్ము
కవిరాజు పలికె చక్కని క్రొత్త ఛందమ్ము!

# ఛాయాగ్రాహిణి

ఆనందము పొంగిపోయి
ఆకాశము అంత ఎగిరి
చందమామ చందమ్మున
చకచక జనుచుండె హనుమ!

అంతలోన రాహువేదొ అడ్డు తగిలినట్లు తోచె
తన్నెదో కడలిలోన దాగి లాగినట్లు తోచె
ఆ యోధుడు పైగమింప ఛాయాగ్రాహిణి హసించె
తిండి కొఱకు ఏడ్చు పొలసు తిండి రండ నోరు తెరచె!

నీట నీడ జాడబట్టి నేర్పుమీర లాగసాగె
పరికించెను ధీమంతుడు పరిశీలన చేసె హనుమ
బద్ధకమ్ము లేనివాని బుద్ధికి తోచని దేమిటి?
వెలుగు లేని కట్టెదుటను నిలుచునె అజ్ఞానతమము?

సుగ్రీవుడు చెప్పిన ఆపద్దలు జ్ఞప్తికి వచ్చెను
రాక్షస మాయలు తెలిసెను శిక్షించగ ఎదురునిలిచె
అసురశక్తి నోరు పెంచె హనుమంతుడు ఒడలు పెంచె
అరుణారుణ భయద కాంతి ఆకాశముపై గ్రమ్మెను!

అరుణారుణ దివ్యమూర్తి ఆకాశముఅంత పెరిగ
ప్రళయకాల వహ్నిశిఖలు ప్రతిఫలించె విశ్వమెల్ల
అంతకంటె భయంకరమ్మాయి అసురశక్తియు విజృంభించెను
భూ నభమ్ములు పట్టుకుంపడగ ముఖము విప్పదై!

అంతలో ఇసుమంత వాడయి
అసురశక్తిని చిల్చెనంచెను
క్షణములో వదనమ్ము దూరేను
నఖములన్ హృది జీల్చి చంపెను!

వీడెను ప్రాణము ఛాయాగ్రాహిణి
వీడెను భీతిని సజ్జన వాహిని
ఛాయా గాహిణి దేహము వారిధి
జంతు సమూహము విందు చేసుకొనె!

శ్రీహనుమంతుడు బహుధీమంతుడు
దేహము పెద్దది కావించినపుడు
శ్రీహరి త్రివిక్రమావతార మని
'ఓహో' యని ఆదిత్యులు పలికిరి

శ్రీహనుమంతుడు బహుధీమంతుడు
దేహము సొగసుగ కుంచించినపుడు
శ్రీహరి వామన అవతారంబని
'ఓహోహో' యని సన్నుతి చేసిరి!

మహావాయు తనూభవుడు
మహాదేవ వరోద్భవుడు
నభోవీధి గమించంగ
'ప్రభో' యంచు స్తుతి చేసిరి!

సాగరమ్ము దాటగలవు సంగరమ్ము సేయగలవు
భూమిజాత జాడగలవు స్వామికృపను పొందగలవురా!
తోయధి లంఘించగలవు ధ్యేయము సాధించగలవు
న్యాయము గెలిపించగలవు మాయను ఛేదించుటెంతరా!

అసురబలము కాల్చగలవు
అమరబలము తేల్చగలవు
అమృత ఫలము తీయగలవు
అమిత బలము మాకు నీవెరా!

బాధ్యత నెరవేర్చుటలో
మధ్య నెదుర్కొను రిపు పరిమార్చుటలో నై
విద్య మెరింగిన వీని క
సాధ్యము లేదనిరి సిద్ధ సాధ్యవరేణ్యుల్!

'జయరామ జయరామ' అని రాముని తలంచి
రయము రయమున సాగె వాయు వేగమున
కనుచూపు మేరలో గిరిపంక్తి పరికించి
గమన వేగము కొంత తగ్గించి తగ్గించి

వైనతేయుని రీతి వాలాడు గిరిపైన
అనువైన అదనుకై ఆగాడు గిరిపైన
ఆమూర్తిలో సుంత అలుపు అన్నది లేదు
ఆముఖములో దివ్య కాంతి ప్రదీప్తంబు!

ఫాలమ్ముపై మెరయు బ్రహ్మ తేజశ్శక్తి
వాలమ్ము మునుసాగు కాలపాశము రీతి
ఆశక్తి ఏమిటో ఆ భక్తి ఏమిటో
అమరేంద్ర గురునకే అద్భుతావహమౌను!

ప్రచండ స్వరూపా! ప్రభా దివ్యకాయా!
ప్రసన్నాంజనేయా! ప్రకీర్తి ప్రదాయా!
జయ హనుమాన్! జయ హనుమాన్!
జయ మతిమాన్! జయ ధృతిమాన్!

# త్రి కూ ట ము

ఆ త్రికూటముపైన చెట్లు
ఆకసమునే అంటుకొనెను
నేత్ర పర్వమ్ముగా లతలు
నేస్తముగా అల్లుకొనెను!

శింశుపా కర్ణికా తరులు
చెలువమ్ము క్రుమ్మరించినవి
గగనమ్ముకే వింత పరిభలు
తగురీతి కూర్చి పెట్టినవి!

అంజనాద్రి విహారి హనుమ
అడుగు మోపగ అవ్వి ప్రీతి
నవ్వులను పువ్వులను చల్లి
నవ్య కాంతుల తేజరిల్లె!

కుందమ్ముల క్రొందమ్ముల
పొందమ్ముల అందములను పొందుగ కూర్చెన్
కందమ్ముల కెంతో ఆ
నందమ్ములు చందనాభిసందన శతముల్!

పుష్పగిరి పూర్వ పక్షాలు పూనివచ్చిన రీతి నుండా
ఇక్ష్వాకు నృపుల పక్షాన ఇట కెగిరివచ్చిన విధాన
అనిలజుడు విహరించినాడు ఆ త్రికూటమ్ముపైన నేడు
అంచాలు తిలకించినాడు ఆ లంక పరికించునాడు!

పూలగాలులు తనను ముసురుకున్నాయి
పూలమాలలు వచ్చి ముంచి వైచాయి!

పూలతో లతలతో భుజము లుప్పొంగ
గిరిపైన పుష్పగిరి తిరిగి నట్లుండె
కల్ప వృక్షములతో కైలాస శిఖరి
గిరిపైన అలనల్ల తిరిగి నట్లుండె!

శారీర వరకాంతి సౌవర్ణరుచి చిమ్మ
గిరిపైన మేరుగిరి తిరిగి నట్లుండె
పింగారుణ ప్రభల్ శృంగార మొలికింప
గిరిపైకి వ్యాస ఋషి అరిగి నట్లుండె!

వాలమ్ము మెడ్రవేల పన్నగాభరణుండు
గిరిపైన ఒకసారి తిరిగి నట్లుండె
తేజమ్ము విరజిమ్మ దినకరుడు స్వయముగా
గిరిపైన ఒకసారి ఒరిగి నట్లుండె!

పుష్ప మండిత మూర్తి పొలుపుగా నడయాడ
గిరిపైన మందరము తిరిగి నట్లుండె
అసమాన రుచి పొంగ అగ్నిహోత్రస్వామి
గిరిపైన ఒకసారి తిరిగి నట్లుండె!

పక్షితతి స్వామి మారుతికి
స్వాగతము పల్కు చున్నట్లు
ఓంకార మంగళారవము
ఉచ్చ తరముగ సేయసాగ!

చిరునవ్వు పువ్వులూ రువ్వి
పరమ హర్షము పొందె నవ్వి
చిగురు చేతుల నెత్తి హనుమ
చేర రమ్మని పిలిచె వనము!

పత్ర పుష్పాలతో నానుమ
చిత్ర వర్ణాలతో మెరసె
గాత్ర కాంతులు పుడమి చిమ్మ
చిత్రభానుని వోలె తోచె!

అద్రి శిఖరాలపై నెక్కి
ఆ త్రికూటపు చెట్ల నెక్కి
ఆ లంక పరికించినాను
అలనల్ల నదేయాడినాను!

దేహమున పరమాత్మ నంశ
తిలకించు సాధకుని వోలె
అతి జాగరూకుడై నానుమ
ఆ నగరి దరిసింప సాగె!

మొగ్గలతో పలు పూవులతో చిరు
పిందెలతో పెను వృక్షము లున్నవి
పండ్ల భారమున వంగిన కొమ్మలు
పుడమి పదమ్ములు ముద్దిడు రెమ్మలు!

చెన్నగు చోటుల ఎన్నో తోటలు
తోటలలో కడు నీటగు బాటలు
బాటలలో పెను బంగరు కోటలు
కోటలలో పూబోటుల పాటలు!

పాటలలో చెలువారిన మాటలు
మాటల కోటలు దాటును బోటులు
చక్కని చుక్కల నిక్కను చూచిన
ఒక్కట కాళ్ళకు మ్రొక్కను చుక్కలు!

ఆంజనేయ విభుడు సింహావలోక
నముగ లంకలో అంద చందములు చూచి
సైనిక బలమ్ము పరికించి స్వాంత మందు
ఇట్టులని తలపోసె ఒక్కింతసేపు!

"ఏమా రక్షకభట విన్యాసము
ఏమా చంచత్ చంద్రహాసము
ఏమా గూఢచారి పరిశీలన
ఏమా అసుర దుర్గ పరిపాలన!

అంగద నీల సుగ్రీవ హనుమలె
అబ్ధి దాటి రాగలుగు సమర్థులు
అయినను లంకను గెలచుటసాధ్యము
అందరు చతురోపాయములను మరి!

ఐననేమి ఐననేమి న్యాయబలము నాకుగలదు
మాయగాని మాయచేత మటుమాయము చేయవలెను
వర్జింతును ఈవేషము మార్జాలము సూక్ష్మదర్శి
మందిరములు చుట్టివత్తు మంగళములు పట్టి తెత్తు!

అనుమానము కలుగదెందు అంతటయును తిరుగుచుందు
అమ్మ జాడ తెలిసికొందు నెమ్మనమ్ము శాంతినందు"
అనిల కుమారుడు మనమున ఆలోచన గావించెను
గగనము ఎర్రగ పూచెను గ్రహాలు శుభముగ చూచెను!

వేవెలుగుల దొర చాటున కేగెను
వెలవెల పోయెను వెలగల నగరము
లంకాపురిలో చీకటి క్రమ్మెను
శంకాకుల మయ్యెను పురివదనము!

సుందర మందారము

పక్షులు కూసెను నగరము వెలుపల
రెక్కలు విప్పెను పురిపై గ్రద్దలు
పిట్టలు సూర్యుని వెసవెస చేరెను
పట్టణమున మన మారుతి దూరెను!

అనిల పుత్రుడు మదిని రాముని తలంచి
రామ నామము జపియించి రామ కొఱకు
తగిన వేషమ్ము స్మరణమాత్రన ధరించి
ఎడమ కాల్మోపి పురి ప్రవేశించినాడు!

పట్టపగలు కన్పించెడి భగవానుడు మసకయ్యెను
అజ్ఞానము క్రమ్మినట్లు అంధకార మలముకొనెను
మాయలోన పడిపోయెడి మానవులను ఉద్ధరించ
అరుదెంచెను సునక్షత్రుల అంబరమున అమృతకరుడు

మెల్లగా వాయువులు వీచె
చల్లగా వెన్నెలల్ కాచె
తల్లిగా చంద్రముడు చూచె
పిల్లిగా కపివరుడు లేచె!

రామచంద్రుని క్షేమమెంచి రజనీకరుడు లంకలోన
మందిరాంతర వీధులందు మార్గమ్ము చూపించినా
మంచి శిష్యునకు సద్గురువు మార్గము చూపించిన
గైర్వాణ శిష్యసంతతికి కౌముదిని బోధించినటుల!

రజనీకరుని వెలుగులందు
రజనీచరులు కానకుండ
రజనీకరాననను వెదుక
రజని యందా హనుమ జనెను!

# లంకిణి

లంకనుగాచే లంకిణి రక్కసి
శంకింపగను దిశలను పరికించెను
నిసినిసి విసవిస జనిచని పరువిడి
వెసవెస నిలచి నిలచి తిలకించెను!

కనుపించని చీక లో లంకిణి
కన్ను పొడచుకొని కనుగొన తలచెను
చనిచని మరి కని మరిమరి పరుగిడి
కనుగొని వచ్చిన చోటుల కనికని

చివరికి ఎటులనో 'శివ శివ' యనుకొని
కనుగొనె ఒకమూలన హనుమంతుని
అసలే లంకిణి అసలే రక్కసి
ఆపయి కోపము ఆపయి కసికసి!

పటపట పటపట పన్నులు కొరికెను
కన్నుల నిప్పుల కణికలు రాల్చెను
చరచర పెరిగిన దురహంకారము
దేహము దాల్చిన తీరున పలికెను!

"ఎవ్వడవురా నీవు! ఎటునుండి వచ్చితివి
ఏమి వేషాలురా ఏమి నీసాహసము
ప్రాణాలపై ఆశ వదలుకొని వచ్చితివ
వానరా! ఓ నరా! పలుకరా! వనచరా!"

అని ఇట్లు పలికిన లంకిణీ రక్కసికి
ఆంజనేయస్వామి అనె ఆగ్రహముతోడ
"అసలు నీవెవరివే? అసలు రూపంబేమి?
నన్నడ్డుటకు నీకు ఎన్ని గుండెలు గలవు?

భయపెట్టుచున్నావు భంగపడి పోయెదవు
ఈ వికారంబేమి! ఈ వికారంబేమి
నీ వృత్తాంత మంత వివరించవే సుంత"
ఆ మాటలకు లంక అతిగర్వమున పల్కె

"నేనేను ఈలంక! నేనే మహాసురను!
నేనె రక్షకురాల! నేనె శిక్షకురాల!
నీవేల వచ్చితివి నిను నేల కూల్చెదను
నే కాపలా యుండ నీ విందు వచ్చుటా!

నను గెలువకుండగా నగరిలో చనగలవ?
నా కెరుక పడకుండ నీకు సాధ్యంబగున?
నా ఆజ్ఞ లేకుండ లంకలో జొచ్చుట
ప్రాణాల మమతవిడి చిటికెలో చచ్చుట!

నీవెంత మూర్ఖుడవు నీవెంత అల్పుడవు
నీవెంత నాచేత నిక్కి నేగ్గెదవురా!"
అపుడు వ్యంగ్యమ్ముగా అనె అనిలపుత్రుండు
"ఒకసారి మీ నగరి ఒప్పు కన వచ్చితిని!

పో. మ్మ ఁంచమును పోయేది ఏముంది?"
అన అన్న పల్కులకు ఆగ్రహించిన దామె
రెచ్చిపోయినదామె పిచ్చిగా ప్రేలుచూ
కం కావరముతో భండనమునకు వచ్చె!

మదమెక్కిన రక్కసి హనుమంతుని
మాన్యుని సామాన్యునిగా తలచెను
మనుజుడులే అని పిడికిట మొత్తెను
హనుమంతుడు అంతట చేయెత్తెను!

రక్కసి కనులకు చీకటి క్రమ్మెను
ముక్కులు మిక్కిలి నెత్తురు చిమ్మెను
రక్కసి భయమున చేతులు మోడ్చెను
అక్కపి పాదమ్ముల పడి ఏడ్చెను!

సతతము సత్పురుషుల హృదయమ్ములు
శాంతికి సత్కరుణకు నిలయమ్ములు
ధీరుడు దీనను దనుజాధీనను
కూరిమి పేరిమితో కరుణించెను!

ఏ ప్రక్కన ఏదిక్కున
ఎటు వెళ్ళిన విజయంబో
అది అంతట వివరించెను
ఆ లంకాపురి గుట్టును!

ఎంతటి దుష్టుండైనను
అంతమ్మున మారిపోవు
మర్మమ్ములు తెలియపరచి
మది దాచక మాట్లాడెను!

"నను జయించినవాడ ఘనబలము గలవాడ
మనగోరు దీనులను మన్నించు మొనగాడ!
లంకలో నీకు ఆటంకమే లేదురా
ఇంక ముందుకు పొమ్ము శంకయే లేదురా!





పరనారి పొందుకై పట్టుపట్టినవాడు
పరమనైష్ఠికుడైన పరమశైవుండైన
అతిలోక వీరుడని ఖ్యాతి నార్జించినా
అమరులను గిమరులను ఆజి సర్జించినా

శ్రుతితప్పి ధృతితప్పి గతితప్పి మతితప్పి
క్షితినందు అతిహీనస్థితినందు మృతినందు
అకలంక శుభచరిత! ఇక శంక లేదయ్యా
ఈలంక నశియించు ఇక శుభము! గమియించు!

బ్రహ్మరహస్యము ఇది బ్రహ్మతేజోనిధీ!
బ్రహ్మ నిష్ఠాపరైన బ్రాహ్మణోత్తమ! ధీర
వేదవేదివి నీవు విష్ణుః క్షత్రశ్రేష్ఠ!
విజయమ్ము నీ దీక్షనెనువెంట పరుగిడును!

నను జయించినవాడ! ఇనకులుని సేవకుడ!
వినయమ్ము గలవాడ! విజయమ్ము నీదిరా!
పవివోలె అనిపించు పలుకు దొంతర నీది
నవ్య నవనీతమ్ము దివ్య హృదయము నీది!

న్యాయమ్ము నీదిరా త్యాగమ్ము నీదిరా!
స్వార్థ మెరుగనివాడ సత్య మెరిగినవాడ!
ఆదర్శ మీవెరా అఖిలలోకములందు
అంజనా వరపుత్ర రంజితామరమిత్ర!

ఏ దేశమున స్త్రీల కాదరణ మిక్కుటమొ
ఆ దేశమున శ్రీలు ఆహరహము వర్షించు
అందుకో విజయమ్ము సుందరారుణగాత్ర!
శూరవీరాగ్రణీ! సుందర సుహృన్మణీ!



# బంగారు లంక

అటనుండి పవనజుడు మటుమయామైనాడు
ప్రాకారమును దూకి లంకలో జేరాడు
మారు వేషముతోడ మాయ వేషముతోడ
చాప క్రిందకు ప్రాకు జలములా వచ్చాడు!

శత్రువు శిరస్సుపై చరణ ముంచిన రీతి
వామపాదము పెట్టి పట్టణము జొచ్చాడు
రాజవీధులలోని రక్షో విహారమ్ము
రాజబృందములోని రాక్షసము కర్కశము!

శాలాంతరములందు శస్త్ర ప్రదర్శనము
ఆకాశ వీధులం దస్త్ర ప్రదర్శనము
ఉన్నత స్థాయిలో యుద్ధ విన్యాసాలు
సైనికాగ్రేసరుల చటుల అభ్యాసాలు!

ఉడురాజు చుంబించు ఉద్యాన నృత్యాలు
సౌధాంతరములందు చక్కని గవాక్షాలు
భోగభాగ్యాలన్ని యాగశాలలనన్ని
శైవాలయాలన్ని జప తపోవనులన్ని

పరికించి చూచాడు
మరిపించి చూచాడు
మరి మరీ చూచాడు
మానినీమణి కొఱకు!

# అ న్వే ష ణ ము

పుష్పవాటిక లోని భోగవంతుల లోని
ప్రకృతి సౌందర్యాలు రాక్షసాంతర్యాలు
పరికించుచున్నాడు పవన నందనుడు పురి
మరిపించుచున్నాడు మారుతాత్మజుడు!

ఆకాశమ్మును చుంబించే సదనమ్ములు
రాకాశశి తలదన్నే స్త్రీ వదనమ్ములు
లోకాలను పోకార్చే ఘోరాస్త్రమ్ములు
నాకాంగన ఎరుగని విచిత్ర వస్త్రమ్ములు!

పొగలు సెగలు చిమ్మని యంత్రాగారమ్ములు
ధగ ధగ మెరిసే గోపుర ప్రాకారమ్ములు
పగలు రేలు తెలియని మణిమయ దీపమ్ములు
మగువల మానమ్ములు బలిగొను అతి పాపమ్ములు!

చిత్రములగు మాల్యమ్ములు పాత్రములగు మూల్యమ్ము
అసురవరుల బాల్యమ్ములు ఆందోళిక తౌల్యమ్ములు
పరికించుచున్నాడు పవననందనుడు పురి
మరిపించుచున్నాడు మారుతాత్మజుడు!

చీమంత ఐనాడు చిటికలో దూరాడు
బ్రహ్మాంత ఐనాడు లంకంత నిండాడు
సాకారమై అతి నిరాకారమై పురిని
గాలించసాగాడు పాలించసాగాడు!

చంద్రముడు వచ్చాడు చంద్రికను పరచాడు
దారి చూపించాడు ధైర్య మందించాడు
మత్తగజంపై వీరునివలె మందరగిరిపై సింహం వలె
రాజు మెల్లగ పైకివచ్చాడు ప్రభలు చల్లగ ఘనినిచిలికాడు!

హనుమకు ధైర్యం వచ్చింది ఆత్మకు ధైర్యం హెచ్చింది
దేవ సమూహం మెచ్చింది దితి కడుపుకోత రెచ్చింది

ఆ వెన్నెల జాడల్లో ఆ చెన్నగు వాడల్లో
సంపన్నుల వీధుల్లో ఆపన్నుల గుడిసెల్లో

చల్లగా మెల్లగా జాలిగా గాలిగా
వస్తున్నాడు హనుమ చూస్తున్నాడు హనుమ
ముందుకు నడుస్తూ కొంచెము జడుస్తూ
వెనుదిరిగి చూస్తూ కనుగప్పినాడూ!

దూరిపోతున్నాడు దొంగలా మ్రుచ్చులా
మారిపోతున్నాడు మానులా మధుపులా
పారిపోతున్నాడు బల్లిలా పిల్లిలా
జారిపోతున్నాడు నీరులా ఏరులా

ప్రాకారము ప్రాకి రాక్షసాకారములు చూచి ప్రక్క
ప్రాసాదముల నెక్కి కఠిన పాషాణముల నక్కి వేగ
సోపానముల నిక్కి మదన తాపోపవని దాటి రావ
ణా వాసములు చూచి పెక్కుభావాల వలయాల చిక్కి

పరికించుచున్నాడు
పవమాన నందనుడు పురి
మరిపించుచున్నాడు
మారుతాత్మజుడు!

సామగానములు చేసేవారిని
సంగీతమ్ములు పాడేవారిని
మృదు లాస్యమ్ములు చేసేవారిని
పద వాక్యమ్ములు చెప్పేవారిని

స్తోత్ర పాఠములు పలికేవారిని
చిత్ర కవిత్వము చెప్పేవారిని
వేదాధ్యయనం చేసేవారిని
వాదమ్ములు చర్చించేవారిని

పరికించుచున్నాడు
పవమాన నందనుడు పురి
మరిపించుచున్నాడు
మారుతాత్మజుడు!

మంగళ వాద్యాలు మధుర సంగీతాలు
అంగనా నాట్యాలు రంగ విన్యాసాలు
కమనీయ రాగాలు కామోపభోగాలు
కేళీ వినోదాలు కేకీ నినాదాలు

స్వర సంతత గీత వాద్య బుధ గోష్ఠులు
స్మర మండిత అగ్రాసన ఉపవిష్టులు
ప్రశంసా వాక్యముల కోలాహలములు
ప్రసంగావిర్భూత హాలాహలములు!

ప్రభువుల కొలిచే చెలుల గీతాలాపమ్ములు
సభికులు చేసే పలు వెంగలి ప్రలాపమ్ములు
పరికించుచున్నాడు పవమాన నందనుడు పురిని
మరిపించుచున్నాడు మారుతాత్మజుడు!

స్థూలదేహులు సూక్ష్మదేహులు
గౌరవర్ణులు కాలవర్ణులు
వికృతరూపులు వింతపాపులు
కంటపడినారూ!

వికటనేత్రలు వికటపాదలు
వికటకర్ణలు వికటఫాలలు
వికటహస్తలు వికటకంఠలు
కంటపడినారూ!

శూన్య కేశిక శూన్య నాసిక
శూన్య కర్ణిక శూన్య జానుక
శూన్య శీర్షిక శూన్య దంతిక
ఎదురుపడినారూ!

దీర్ఘజిహ్వలు దీర్ఘనేత్రులు
దీర్ఘకర్ణులు దీర్ఘ దంతులు
దీర్ఘ బాహులు దీర్ఘ కాయులు
కంటపడినారూ!

బాణ హస్తులు అప్రశస్తులు
శూలధారులు గూఢచారులు
సూక్ష్మగ్రాహులు స్థూలదేహులు
కంటపడినారూ!

అందగత్తెలు వయసుకత్తెలు
మందగమనలు మందబుద్ధులు
సుందరాంగులు వందలాదిగ
సందడించారూ!

ఎఱ్ఱ కన్నుల నిప్పులురలగ
తోఱ్ఱి ముక్కుల గుఱ్ఱు ఱ్ఱమోయగ
బొఱ్ఱ మీసల నిమ్మ నిలిపే
బిఱ్ఱబిగిసిన వారలన్!

క్రూర కర్మలు వికృత చేష్టలు
ఘోరహత్యలు దారుణమ్ములు
నిరపరాధుల మారణమ్ములు
చూచి నడిచాడూ!

లంబోష్ఠలు లంబాస్యలు
లంబోదర లంబబాహా లంబకపోలల్
లంబాంఘ్రులు లంబాక్షులు
లంబాలక లంబజాను లంబ నితంబల్!

ఎదురైన తప్పుకొని
ఎంతగానో నక్కి
పరికించసాగాడు
పవమాన సుతుడు!

ఓరచూపులు చూచి మారు తూపులు విసరి
చిరునవ్వు లొలికించి చిన్నిపూవులు రువ్వి
వీరులను ఒకసారి మారుకేళికి జేరు
నారీమణుల గదియు నాయకమ్మన్యలను!

పరికించుచున్నాడు
పవమాన నందనుడు వారి
మరిపించుచున్నాడు
మారుతాత్మజుడు

కోట బురుజుల నెక్కి కోట బురుజుల క్రింది
పరిఖలను పరికించి పరిఖలందున నున్న
పాపజాతిని చూచి పాపజాతిని చంపి
ప్రాకారములు ప్రాకి ప్రాకారముల చెంత

భవనాలలో దూరి భవనాలలో వీచు
పవనాలలో సాగి పరికించసాగాడు
వాయుదేవుని సుతుడు వానర ఘనుండు
సుగ్రీవ మంత్రులం దగ్గేసరుండు!

నక్షత్రములనంటి అంత
రక్షాల తలదన్ని మెరయు
వృక్షాలపై జేరి గృహాగ
వాక్షాలలో నుండి భయద
రక్షోమహావీర విపుల
వక్షాలు తిలకించి శత్రు
పక్షాల బలమెంచి అమిత
దీక్షా పరుండగుచు అచట

పరికించుచున్నాడు పవనాత్మజుండు పురిని
మరిపించుచున్నాడు మారుతాత్మజుడు!

పోకలో పోకగా ఆకులందున దాగి
పువ్వులో పువ్వుగా పుష్పాపదులతో సాగి
కొమ్మలో కొమ్మగా రెమ్మలందున దూరి
పక్షిలో పక్షిగా పాదపమ్ముల నెగిరి

పరికించుచున్నాడు పవమానసుతుడు పురిని
మరిపించుచున్నాడు మారుతాత్మజుడు!

పరువెత్తి పరువెత్తి పైపైకి పోయి
శిరసెత్తి శిరసెత్తి చేయడ్డి చూచి
నిట్టూర్చి నిట్టూర్చి ఎట్టులా యంచు
గుట్టు తెలియగరాక కోపమ్ము వచ్చి

తోకను మెలివేసి తొకూడ కరచి
ఆకలి దప్పికలు అన్నియును మరచి
పరికించుచున్నాడు పవనాత్మజుండు పురిని
మరిపించుచున్నాడు మారుతాత్మజుడు!

నిండు పున్నమి పండు వెన్నెట
నిండు జవ్వను లాడుచుండగ
ఉండు ఉర్విజ యంచు చని ని
ల్చుండి నిట్టూర్చెన్!

చంద్రశిలపై చంద్రికలలో
చంద్రవదన యొకర్తు యుండగ
చంద్రముఖి రఘుచంద్రసతి యని
అరిగి నిట్టూర్చెన్!

హరిణలోచన లొక్కచోటను
హరిణములతో ఆడుచుండగ
ధరణిపుత్రిక అందు గలదని
ఆరిగి నిట్టూర్చెన్!

చలువరాతీ కట్టడమ్ముల
కలువ కొలనుల మెట్ల నిలచిన
కలువకన్నుల కలికిమిన్నల
గాంచి నిట్టూర్చెన్!

కొండ రొప్పులకుప్పలప్పుడు
ముందు కెగురుచు ఉప్పు పట్టెల
నందమొప్పగ ఆడుచుండగ
కాంచి నిట్టూర్చెన్!

రంగురంగుల వలపుటేరులు
పొంగులెత్తే పూల తోటల
చెంగలించే లేడి పిల్లల
చేరి బ్రతిమాలెన్!

పవ్వళించిన పద్మనయనల
పువ్వు లల్లెడి పువ్వు బోణుల
నవ్వుమోముల నాతిమిన్నల
వెదకి వేసారెన్!

ముద్దు గుమ్మలు పెక్కు చోటుల
మద్ది చెట్లకు ఉయ్యలేసి
పెద్ద ఊపులు ఊగు తోపుల
వెదకి వేసారెన్ !

వాడలో గల చెరువులో పసు
పాడి లలనలు నడచుచుండగ
నీడ నిలబడి రామవిభు పూ
బోడి గన నెంచెన్!

పేరటమ్ములు చేసి కొందరు
వారిజాక్షులు వెడలుచుండగ
వారిలో సీతమ్మ గనుగొన
మారుతియు నడచెన్!

కలువరాయని వెలుగు వెల్లువ
కలువ కొలనుల పొంగి పొరలన్
జలకమాడే కలువ గంటుల
గాంచి నిట్టూర్చెన్!

ఉబుసుపోకకు ఊరిలోపల
కబురులాడుచు ఉవిద లొచో
గుబురుకొని కూర్చుండి యుండగ
చూచి నిట్టూర్చెన్!

స్వామి కార్యము చేయవలయును
ఏమి చేయగ తోచకుండెను
ఏమిటో అనిపించి అటుగా
నామారి నడచెన్!

రావణాసుర నవ్య ప్రాసాద మగుపించె
రత్నరాజిత మేరురాజగిరి తలపించె
ప్రాసాద శిఖరాల రాజిత పతాకాలు
బహురత్న మేదుర ప్రభల ప్రతీకాలు!

రత్న కాంతుల తోడి రంజిల్లు భవనాలు
నూత్న గంధముతోడి నూల్కొనెడి పవనాలు
క్రీడా గృహాలలో కేళీ వినోదాలు
క్రీడావతుల తోడి ప్రేమానుమోదాలు!

రక్షో మహామంత్రి రమణీయ సౌధాలు
తక్షణమును పరిశోధనము చేసి వచ్చాడు
అంతఃపురాలలో అంతర్గృహాలలో
కాంతలందరి జూచి 'కాదు' అనుకున్నాడు!

# పుష్పకము

అటువెళ్ళి ఆపైన అందాల వాకిలో
మిన్నంటి మెరిసేటి మేడలను చూచాడు
అందు కడు అందమ్ము చిందేటి పుష్పకము
రాజులా కనిపించు! మోజునే కలిగించు!

పూర్ణ వాసనలతో పొల్పార పుష్పకము
పూర్ణ భోగాలతో ముదమార కనిపించు
పుష్పక విమానమ్ము పూర్ణ సౌఖ్యప్రదము
పుష్ప సంభరితమ్ము పూర్ణ భోగప్రదము!

దివినుండి భువిపైకి దిగియున్న స్వర్గమై
నవనవోజ్జ్వల శోభ నవ విధమ్ముల గూర్చు
వికసిత ప్రసూనాలు విలసిత ప్రమోదాలు
సుఖతర ప్రభావాలు సుందరానందాలు!

అది చూచి పవనజుడు అచ్చెరువు చెందాడు
అది మెచ్చుకున్నాడు మదినొచ్చుకున్నాడు
ఏమి చాతుర్యమ్ము ఏమి సౌందర్యమ్ము
ఏమి నైపుణ్యమ్ము ఇది పూర్వపుణ్యమ్ము!

లత లల్లిన తరువులతో
లలిత లలిత సుమములతో
మధుర మధుర ఫలములతో
మధువనమును మరిపించును!

భిత్తికలపై నేల మెత్తులు అమర్చాడు
ఎత్తుగా కొండలను గుత్తిగా చేర్చాడు
కొండలందున చెట్లు మెండుగా దిద్దాడు
చెట్ల కొమ్మల చివర చిగురులను అద్దాడు!

చిగురుటాకుల నడుమ చిన్ని పొన్నా పూలు
పూలతో వ్రేలాడు పుష్ప కేసరమాల
ఎంత అందమ్ముగా ఎంత చిత్రమ్ముగా
వింతగా మలచబడె కాంతుల విమానమ్ము!

అందులో ఎన్నెన్నొ అంతస్తులున్నాయి
అన్నింటిలో చిత్రితాలంకరణ మెంతో
మంచి మాణిక్యాలు మణి రత్న కనకాలు
చింతాకు పతకాలు చింతామణీ ప్రభలు!

ఎన్నొ విహంగాలు ఎన్నొ కురంగాలు
ఎన్నొ భుజంగాలు ఎన్నొ తురంగాలు
అద్భుతావహామానా ఆత్మనాకర్షించు
అందాలు చందాలు డెందాల నలరించు!

అందులో వెలుగొందు అనుపమ సరోవరము
సరసిలో విరబూయు అరవింద సుమదళము
అందాల కోనలో మందార వనములో
సుందరీ స్నానాల సౌందర్య సరసిలో

పద్మాలయకు ప్రీతి బహువైభవమ్ముగా
అరవిందముల బట్టి కరములన్ పైకెత్తి
కరియుగము గావించు కమలాభిషేకాలు
నీరాభిషేకాలు క్షీరాభిషేకాలు!

మయుని శిల్పానల్ప మధుర
మంజులోదాత్త కల్పనము
ఈకళాఖండమై ఇచట
ఈరూపుదాల్చి నిల్చినదో!

ఏమహా కవితా మరాళ
మోహవిహార భూమికలు
సంకల్ప మాత్రమ్ము చేత
సాకారమైనవో ఇచట!

ఎంతకల్పన చేసినారు
ఎంతభావన చేసినారు
ఎంతగా కష్టించినారు
ఎంతగా సృష్టించినారు!

ఔర! ఔరా! యంచు హనుమ
తేరిపారగ జూచినాడు
మది చిక్కుకొనకుండ మనసు
మరలించుకొనగల్గినాడు!

తామరస పత్రమున మెరయు
తరళబిందువుపోలె హనుమ
అంటకుండగ మసలినాడు
అచటన్నియును చూచినాడు!

# శయన మందిరము

అంతటను కాళ్ళరుగ తిరిగి
కొంత యోచించి యోచించి
శయనమందిరమందు కమల
నయనలను పరికించసాగె!

ఆ మందిరములోన
అర్ధరాత్రియువరకు
ఆనంద నృత్యాలు
ఆడి అలసినవారు

మన్మథక్రీడలో మధురానుభూతిలో
మధుపాన మహిమలో అధరపానమ్ములో
ఆలింగనమ్ములో ఆదమరచిన స్త్రీలు
నియమ రహితమ్ముగా నిద్రించుచున్నారు

రమణుల అందమ్ము
రత్నకాంతుల మధ్య
దేదీప్యమానమై
తేజరిలసాగినది!

వక్షోజములపైని వస్త్రముల్ జార
అడుగుదమ్ములపైని అందియల్ జార
అసమాన సౌభాగ్య హారముల్ జార
నెరజాణ లెరుగక నిద్రించినారు!

ఒక్క విరిబోణి సూత్రమ్ము
పెరిగిపోయినది
ఒక్క చేడియ తిలకమ్ము
చెరిగిపోయినది!

ఒక్క ఒయ్యారి సీమంత
మొరిగిపోయినది
ఒక్క కామినీ స్వప్నమ్ము
కరిగిపోయినది!

ఒక్క సుందరి అందమ్ము
చిందిపోయినది
ఒక్క ప్రియురాలి ముఖకాంతి
వెలిగిపోయినది!

ఒక్క పూబోణి జవ్వనము
పొంగిపోయినది
ఒక్క ఒయ్యారి సింగార
మొలికిపోయినది!

ఒక్క వెలది తనూశోభ
వెన్నెలగుడి కట్టవచ్చు
ఒక్క చెలిమోము అందమ్ము
నెలరాజు తలదన్నవచ్చు!

ఒక్క ఎలనాగ పరువమ్ము
ఎంతైన వెలగట్టవచ్చు
ఒక్క స్త్రీమూర్తి చెలువమ్ము
చిదిపి దీపము పెట్టవచ్చు!

ఒక్క ప్రియకాంత అధరమ్ము బింబఫల సమము
ఒక్క చిగురుబోణి కరాలు చెంగలువ తూళ్ళు

ఒక్క నెరజాణ నెరివేణి నీలాలప్రోవు
ఒక్క హంసయాన పదాలు అంబుజద్వయము

వల్లభుని కౌగిటన్ పట్టుకున్నట్లు
వల్లకిని ఒక భామ పట్టి నిద్రించె

సుందరుని అధరమ్ము చుంబించుపోల్కి
వేణువును తన పెదవి పెట్టి నిద్రించె

బిడ్డను చంకలో పెట్టుకున్నట్లు
మద్దెలను పట్టుకొని మగువ నిద్రించె

మదిరాక్షి వేరొక్క మగువను నిద్రలో
ప్రియునిగా తలపోసి బిగి కౌగిలించె

ఒక భామ ఒడిలోన ఒకతె తన తల జేర్చె
ఒక కొమ్మ రొమ్ముపై ఒకతె చేతులు వైచె
ఒక సుదతి బుగ్గపై ఒకతె మోమును జేర్చె
ఒక కాంత తొడపైన ఒకతె కాళ్ళను వేసె

ఒక నాతి పొట్టపై ఒకతె జుట్టును విప్పె
నెరజాణ లెరుకచెడి నిద్రించుచున్నారు

వరుసగా పడుకున్న స్త్రీలు
విరి దండలో నొప్పు పూలు

లతలట్లు బాహువుల పంక్తి
లలిత సూత్రము భాతి తోచె!

చదలపై వెలిగేటి చక్కనౌ చుక్కలను
సగసమ్ములోనున్న చక్కనీ చుక్కలూ
కాలిగోళులు చూపి గేలిచేస్తారు మరి
కేలంటి బుగ్గలన్ గిల్లి పెడతారు!

తారల రీతిగా తరుణీజనంబొప్ప
తారాధిపతి వోలె దానవేశ్వరుడొప్ప
ఆ మందిరంబపుడు అందాలు చిందించు
రాకానిశా మండితాకాశమై తోచు!

ఆ మందిరముమధ్య హంసతూలికపైన
అతిలోక సుందరుడు అతివీర సాహసుడు
నారీమణులమధ్య శూరాధిపతియైన
రావణేశ్వరు డపుడు రంజిల్లసాగాడు!

అతని అందము చూచి
అతని చందము చూచి
హనుమంతు డెంతయో
ఆశ్చర్యపడినాడు!

ఆ మందిరము రావణాసురుని ప్రియ రీతి
అతిలోక సౌందర్యవతి వోలె కనిపించు
పదునాల్గు భువనాల భవ్యతర చిత్రాలు
శృంగార మొలికించు బంగారు కుడ్యాలు!

నవరత్నరంజిత సువిశాలమైన
నూత్న కాంతుల నీను రత్నకంబళము
ఆ మందిరంబెల్ల అందమ్ము చింద
అరవింద సదృశమై పరచగాబడెను!

ఆ కంబళము మధ్య అసమానమైన
పర్యంక మెత్తుగా భాసించుచుండె

అతిమూల్య మృదుతర ఆస్తరణ మొకటి
తరుణు లందమ్ముగా పరచి యున్నారు!

దంతములతోడ పనితనముగల మెట్లు
చక్కగా జవ కట్టి చెక్కి కూర్చారు!

చామరలు ధరియించి సారసాక్షులు వీవ
అగరుధూపము లల్లనల్లగా ప్రాకగా

మల్లె పూవు వంటి తెల్లనగు పాన్పుపై
పవళించె రావణుడు ప్రావృట్ ఘనములీల!

సౌవర్ణ సోపాన సంఘ సంఘటితమై
సౌదామినీ లతా సందోహ కలితమై

సౌగంధ ధూపవాసనలు ప్రకోపించ
సౌరభ్య సంపద్వికార మండితమయ్యె!

సూత్నశోభలు చింది రత్నములు మెరయ
చక్కగా వెలుగొందె శయన మందిరము!

మునిమాపు వేళలో ఘనరాజమట్లు
భూషణమ్ముల కాంతి పొంగారుచుండ

రక్త చందన లిప్త రంజితాంగుండు
పాన్పుపై ఠీవిగా పవళించినాడు!

హరివింటితో మెరయు అంబుదము లీల
పాన్పుపై రావణుడు పవళించెనపుడు
రాజురావణు ప్రక్క రాణిమండోదరి
రుచిమీర నిద్రించె రోహిణీ సతివోలె!

ఆమె సౌమ్యత చూచి ఆ ప్రశాంతత చూచి
ఆమె సీతగ తలచి ఆనందపడె హనుమ
వాలమ్ము సారించి నేలపై చరిచాడు
ఫాలమ్ము విప్పార్చి పై పైకి ప్రాకాడు!

ఉప్పొంగిపోయాడు ఉప్పరం బెగశాడు
కుప్పించి దూకాడు తెప్పున్న వాలాడు
శ్రీ ఆంజనేయుండు శ్రితజనోపాయుండు
శ్రీరామభక్తుండు సేవానురక్తుండు!

క్షణములో భ్రమతొలిగె సలిపె ఆలోచనము
క్షణములో తెరవీడి కలిగినది యోచనము
మాయ ఎంతటివారి మతినైన పోనొట్టు
వలపన్ని తలచెంత నిలిచి ప్రతీక్షించు!

ధీమంతు డెప్పుడును తెలివిగా చరియించు-
మాయ గ్రమ్మినపుడును మతిమంతుడై చూచు
'మాయ! ఎంతటి శక్తిమంతురాలవె! నీవు
నామతిని గ్రమ్ముదువె నాగినీ!' అనుకొనెను

క్షణములో తెరతొలిగి సలిపె ఆలోచనము
'జనకాత్మజాత ఈ సరణి వర్తించునా!
ఇది అసంభవమిలన్ ఇది అబద్ధంబిలన్
ఇది అసంఘటనమా ఇది అనూహ్యంబునా!

రామచంద్రునిపత్ని రావణుని చేరునా
నేమమ్ము విడనాడి నీచముగ మారునా!
వెన్నెలలు నెలరాజువీడి చరియించునా
చిన్నఅల నదివీడి చెదరి ప్రవహించునా!

మందారమును వీడి మధుపంబు పోవునా
ఎండైన జిల్లేడి చందాలుచూడగా!
కమలాకరమువీడి కలహంస ఏగునా
చెమరించి భ్రమపెట్టు చెలమలను చూడగా!

పూర్ణేందురుచి వీడిపోవునె చకోరమ్ము
చంచలత్వము మీర మంచుబండలవైపు!
మావిచిగురులు మేయు మధుమాస కోకిలము
అరుగునే ఉమ్మెత్త ఆకులను భుజియించ!

వర్ష చినుకులు కాక పతిత జలములు వాన
కోయిలలు ప్రాణాలు పోయినా త్రాగునా!'
అని ఎంచి చింతించి మనమెరియ విలపించి
కన్నులను తుడుచుకొని కర్తవ్యమునకు దిగె!

పానశాలలు చూచి పాకశాలలు చూచి
మైమరచి నిద్రించు మదవతుల తిలకించె
పాపభీతికి జంకి ప్రభుశక్తి తలపోసి
నిర్మలంబగు మనసు నిశ్చలము చేసికొనె!

రావణుని కోట్లాది ప్రసాదములు చూచి
చూచిన స్థలములే చూచి మళ్ళీ చూచి
జానకీమణి యున్న జాడయే కనలేక
అతి మనస్తాపమ్ము అనిలాత్మజుడు పొందె!

సంపాతి వచనమ్ము సత్యమ్ము సత్యమని
స్వాంతమ్ము వచియించు సందేహమేలేదు!

ఇచ్చోట ఎచ్చటో ఇనకులేశునిపత్ని
సత్యమ్ముగానుండు సాక్ష్యమ్ముపల్కు హృది!

సత్పురుషులెప్పుడును సత్యమేచెప్పుదురు
అంతరంగముకూడ అదె విశ్వసించినది!

మరల పానశాలలు మరల చిత్రశాలలు
మరల పెరటితోటలు మరల పెక్కుచోటులు

పరితాపమున చూచె పవన నందనుడు
మరి మరీ దుఃఖించె మారుతాత్మజుడు!

వలవలా విలపించె వాయునందనుడు
నిట్టూర్పులను విడిచి ఎట్టులాఅని యెంచె

వెక్కులను దిగమ్రింగి దిక్కులను పరికించి
మిక్కిలిగ దుఃఖించె వెక్కసమ్ముగనేడ్చె!

మాతల్లి కనిపించలేదు సీతమ్మ కనిపించలేదు
నాపుట్టుకెందుకికరామ! నాపైనదయలేద రామా!

మాతల్లి గనకుంట మరలివెళ్ళితినేని
మాతండ్రి రామయ్య మనసు భగ్నమమండు!

కపిరాజుసుగ్రీవు కాంచశక్యంబౌన
కపినాయకులకేను కనిపించనేలౌన?

ఏమి చేయుదు నేను? ఏమి కర్తవ్యంబు?
"రామ రామా" యంచు రమణి సీతను వెతుక
మరియొక్కసారిగా తిరిగి వచ్చెను హనుమ
తిరిగిపోయెను మరియు తిరిగి ఆలోచించె

కడలిలో జానకిని కఠినుడై విడిచెనో
కడుభీతితో సీత కాయమ్మొ వదలెనో
తన ప్రేమ కాదన్నదని రావణుండె
పద్మాక్షి తెగటార్చి భక్షించినాడో!

హింసాప్రియులు మనుజమాంసభక్షకులు
రాక్షసులె సుకుమారి భక్షించినారో!
కష్టాలు పడలేక కాంతు గనలేక
రాముని మదితలచి ప్రాణాలె విడెనో!

మాతల్లి గనకుండ మరలి పోలేను
ఈ విధమ్మున వెళ్ళి జీవించలేను
చనిపోదునా! నేను లేక సన్యాసినౌదునా తండ్రి!
అనియెంచి దేవులకు మొక్కి వినతులర్పణచేసి నిలచె

దేవీ మహోతత్వ రేఖ
ధీ వీధిలో అట్టె మెరసె
బాష్పాకులిత నేత్రుడగుచు
ప్రార్థనాంజలి బట్టి తలచె

నీవే మహాలక్ష్మివమ్మ!
నీవే స్వయంజ్యోతివమ్మ!
నీవె దర్శనమీయవలెను
నిన్ను నేవెతుకుటా తల్లి!

నేనేమి నిను వెతుకుటేమి
నీ కృపాద్యుతి లేకఎట్లు
నేనెంత అల్పుడను తల్లి
నే కేవలము నిమిత్తమ్ము

రామచంద్రా! వందనములు
భూమిజాతా! వందనములు
లక్ష్మణా! అభినందనములు
లాలించి పాలించరయ్యా!

కార్య సాఫల్యమ్ము
కలిగించవలె రామ!
నీవు నడిపినయట్లు
నేను నడిచెదనయ్యా!

నా అహంకృతి పోయె
నా దుష్కృతము తొలిగె
నామీద కరుణచే
నను నియోగించితివి!

కార్యమ్ము నీవేను
కారణము నీవేను
నీ యిచ్ఛయే లేక
నేనేమి చేయుదును?

రామచంద్రా! నమస్తే!
రామభద్రా! నమస్తే!
అన్యథా శరణమ్ము నాస్తి
మాన్యమూర్తీ నీవె ఆస్తి!

సుందర మందారము

ఓ తల్లి జానకీమాత
మాతల్లి కృపజూపుమమ్మ
నీ కటాక్షము వెంట సృష్టి
నిఖిలమ్ము నడయాడునమ్మ!

నీ యంశ నీవుగా నాడు
ఆ యజ్ఞభూమిని రేడు
దున్ని దున్నకముందె నీవు
కన్నులకు కనిపించినావు!

జనకుని కరుణించినటుల
జననిరో కరుణించు నన్ను
నీ లీలయే కదా జగతి
నీ సేవయే మాకు సుగతి!

నీ వఖిల శక్తివే తల్లి
నీ నాటకమె సృష్టి యెల్ల
నీ కృపామృతమిచ్చి శోక
శోకజాలము అదే పోక!

నీ కరుణ ఒక్కింత కలుగ
నిబిడాంధకారముల్ తొలుగు
పేదవాడును ధనము పొందు
వెర్రివాడు వివేకమందు!

మూగవాడును మాటలాడు
మూర్ఖ చిత్తము తెల్వినందు
కుంటివాడును కొండలెక్కు
గ్రుడ్డివాడును నలుసు గాంచు!

నీ వఖిల శక్తివే తల్లి
నిను తలచ కష్టముల్ పోవు
భవబంధములు విచ్చిపోవు
భగవంతు సాయుజ్యమబ్బు!

మానసిక ధైర్యమ్ము అనికక
జ్ఞాన సౌభాగ్యమ్ము కలుగు
జన సత్వములు వచ్చు మిగుల
నవ స్ఫూర్తియును హెచ్చు తల్లి!

అంతలో మానసము
అతి ధైర్యమును పొందె
సుంత ఆలోచించె
సుస్వాంతమున హనుమ

"హీనమ్ము క్షుద్రమ్ము
హృదయ దౌర్బల్యమ్ము
మానమ్ము శేషమ్ము
మహిమ మనః స్థైర్యమ్ము!

దుఃఖమ్మనర్థమ్ము
దుఃఖమ్ము కూడద"ని
దుఃఖమ్ము విడనాడి
తూర్పువైపును చూచె!

జ్ఞానకాంతులు తోచె
మానసము విప్పారె
అనుకొనని ధైర్యమ్ము
అందెను మహాత్మునకు!

# అ శో క ము

అందాలు చిందాడు బృందావనీజాత
చూతవేష్టిత లతా శోభితములు
బృందారకానంద మందాకినీతీర
మందార సుకుమార మారుతములు!

మధుమాస సువిలాస మాకంద తరువాస
కోకిలాంగన కుహూ కూజితములు
మాలతీ మాధవీ మాంజిష్ఠ మల్లికా
వల్లీమతల్లికా వాసితములు!

శ్రీకుమార మంగళ మద సింధురములు
పారిజాత సువాసనా బంధురములు
మధుర కుసుమాళి కల్యాణమందిరములు
చూడవలె వనదేవతా సుందరములు!

అందు క్రీడాశైల మొకటి
అవనీజములు పెక్కు యుండె
ఆ కొండపైనుండి ఏరు
అతివేగమున పారుచుండు!

ఆ తరంగిణిపైకి వంగి
అమల తరుశాఖముల్ తాకు
ప్రణయకుపితను బంధుజనులు
ప్రతిమాలుచున్నట్లు తోచు!

అది అశోకవనమ్ము అదినందనవనమ్ము
అది దుఃఖహననమ్ము అత్యంత పావనము
మధుమాస ముదయించి మంచిరోజులు వచ్చె
వృక్షముల్ పుష్పించి విరుల గంధము హెచ్చె!

కోకిలమ్మలు వనిన్ కూజితమ్ములు సల్పె
కేకిసంఘము లేచి క్రేంకార మొనరించె!

అట కొండకడ కేగగానె
ఆనిలజున కానందమయ్యె
ఆ వృక్షములు జేరగానె
ఆశాంకురము లుద్భవించె!

శ్రీరామభక్తుండు శ్రీ ఆంజనేయుండు
ఆతోట కనిపింప ఆచోట విహరింప
శింశుపా తరుతన్వి శిరమెత్తి చూచినది
చిగురు వేళుల నుంచి చేయెత్తి పిలిచినది!

తనతోడి స్త్రీని వంతల నుండి రక్షింప
వ్యథచెందు సజ్జనుని వాయుపుత్రుని హితుని
స్త్రీమానరక్షకుని శ్రీరామ కింకరుని
పరుల దుఃఖము గాంచి పొరలి ఏడ్చెడువాని

ధర్మతత్పరుని సత్ కర్మతత్పరుని బహు
మర్మవేత్తను రామ సన్మసచివాగ్రణిని
చిగురు చేతులు చాచి శింశుపా తరుభామ
మర్మర ధ్వని చేసి మమతతో పిల్చినది!

నెమ్మదిని చేర్చినది కొమ్మలన్ దాచినది
కొమ్మతో నిల్పి కన్నమ్మగా చూచినది
ఒత్తైన జంపాల హత్తుకొని ఉంచింది
ఉయ్యాలలో పెట్టి ఒప్పుగా ఊపింది!

పాలు చేపుకు వచ్చి పాపాయి కనిపింప
అమ్మ చేతులుచాచి హత్తుకొన్నట్లుగా
మెల్లమెల్లగ వచ్చి చల్లగా నెత్తుకొను
తల్లిలా నిండుజాబిల్లిలా చూచింది!

శ్రీరామభక్తుండు సేవానురక్తుండు
చెంగుచెంగున వచ్చి చెట్టెక్కి కూర్చొనెను
చెట్టుపై కూర్చొనెను చెట్టులో కూర్చొనెను
గుట్టుగా కూర్చొనెను బెట్టుగా కూర్చొనెను!

చిగురుటాకులలోన చిలుకవాలిన రీతి
చంకెక్కగానచ్చు చంటిపాప విధాన
భాగవతశాఖిపై పరమర్షి శుకునిలా
అశ్వత్థ తరువులో అచ్యుతుని మాద్రిగా!

పొన్నచెట్టూపైన కన్నయ్య ఉన్నట్లు
గున్నమామిడిపైన కోకిలమ్మ విధాన
కాదంబినులనున్న కాంతిపుంజము వోలె
అంబునిధిలోనున్న అమృతకలశము మాద్రి

ప్రబలాంధకారమున ప్రాభాతమున్నట్లు
శమివృక్ష గర్భమున జాతవేదుని వోలె
దాగుకొని దాగుకొని ఆగి అంతయు చూచె
ఆ దృష్టిలో శక్తి అవగాహనము కాదు!

# మాతృసందర్శనము

ఆగుట్టపైనుండి ఆచెట్టుపైనుండి
ఆ కొమ్మలందుండి అలరు రెమ్మల నుండి
వనమంత తిలకించె మనమంత పులకించె!

ఆ గాలిలో ఏమి అనుభూతి కలదో
గంధమాదన మట్టి గంధమ్ము వీచె!

శకునమ్ము శుభముగా తోచె
భూమిజమ్ము కడ క్రింద జూచె!

తనువెల్ల కనులుగా పూచె
మనమెల్ల ధ్యానించి వేచె
వనలక్ష్మి నవ్వుతూచూచె!

కన్నులను నులుముకొని చూచె
కన్నీరు తుడుచుకొని చూచె!

కనిపించె సీతమ్మ హనుమ నేత్రములకు
అనిపించె హనుమకు జని ధన్యమైనట్లు!

ఉపవాసదీక్షతో సుపవిత్ర గాత్రమై
అపురూపమైన సోయగము తొణికిసలాడ

ఆ మోములో కాంతి అతిలోక రుచిరమయి
ఆ మేనిలో దీప్తి యజ్ఞ సంభూతమయి

చెట్ల క్రీనీడలో సీతామహాలక్ష్మి
శోభా విహీనమై శుష్కించు తీవలా
అగ్నితప్తంబైన అపరంజిరాశిలా
నిష్కళంకంబైన నీరజారి విధాన

మాతృదాస్య విముక్తి మదినెంచి శ్రమజెందు
గరుడునకు పీయూష కలశి కన్పడినట్లు
మంత్ర శాస్త్రజ్ఞులకు మౌనివరులకు మహా
గాయత్రి తత్త్వ మవగాహనంబైనట్లు

కవితా తపోగ్నిలో క్రాగి మెరసిన కవికి
భవ్య రస రూపమ్ము ప్రత్యక్ష మైనట్లు
ఒక్క కోరిక తోడ ఒక్క దీక్షను బూని
ఒక్క వేషము తోడ ఒక్క వస్త్రము తోడ!

కాకి మూకల నడుమ కోకిలమ్మ విధాన
ఉపవాస దీక్షతో అపహాస్య జనములో
ధనమదాంధుల పాద దాస్యబంధాలలో
తెరువు గానగలేని నిరుపేద జీవిలా

సాక్షాత్తు లక్ష్మిలా సర్వమంగళ లాగు
ఆగమరాశిలా అనసూయమూర్తిలా
మోక్షార్థియైయున్న పుణ్యతాపసి వోలె
ముసురుకొను మొగులలో శశిరేఖ చందమున

శుష్కహాసము తోడ శుష్కవదనము తోడ
రాక్షస స్త్రీలలో రామచంద్రుని పత్ని
బొగ్గులందున మణి సిగ్గుతో నున్నట్లు
మసిగుడ్డలో దాగి మాణిక్య మున్నట్లు

దావాగ్ని మధ్యలో దహియించు తరువులా
సింహముల మధ్యలో చింతిల్లు కరిణిలా
స్వగణమ్ము దూరమై శ్వగణమ్ము మధ్యలో
చిక్కువడి యున్నట్టి చిన్నిలేడి విధాన

వ్యాఘ్ర సంఘము మధ్య ఆవుతల్లి విధాన
పశువుల బాటపై పసిపూల మొక్కలా
గాఢాంధకారమ్ము గ్రమ్ము చలిగాలిలో
మినుకుమని గుడిసెలో మెరయు దీపమువోలె

గాలిలో ధూళిలో నేలపై పొరలాడి
చెలువమ్ము గోల్పడిన తలిరాకు తీవలా
త్రేతాగ్ని మధ్యలో దీక్షతో ధ్యానించు
నగరాజపుత్రిలా సగమైన తపసిలా

కారుమబ్బుల నడుమ కనిపించి కనిపించ
కుండగా కదలాడు ఉడురాజ రేఖలా
శుక్ల పాడ్యమి నాటి శుభ్రాంశువు విధాన
ఉపవాస వ్రతములో ఉన్న అన్నువ వోలె

భగభగలు విడనాడి పొగగ్రమ్మి సెగవీడి
అణగారియున్నట్టి అగ్ని శిఖ మాద్రిగా
పరతంత్ర శృంఖలాబద్ధ జీవనములో
దీనురాలైయున్న దేశమాత విధాన

పగటివేళల కల్వపడతి సోయగ మట్లు
రాత్రివేళల కుందు రాజీవము విధాన
అగ్నిలో తెగగ్రాగి అతిక్రూరముగ సుత్తె
దెబ్బలన్ తినుచున్న దివ్య కాంచనమట్లు

శోకాకరంబైన
భీకరాటవిలోన
క్రూర మృగముల మధ్య
కోదమ హరిణము వోలె

నిప్పురంటిన నిప్పువోలె
పగబట్టిన త్రాచువోలె
పొగ చూరిన ఇల్లువోలె
తనుగుచున్న శ్రద్ధవోలె

ఫలియింపని ఆశవోలె
చలియించని తిమిరమట్లు
అడ్డు పడిన సిద్ధివోలె
చెడ్డదైన బుద్ధివోలె

అపవాదము పొందినట్టి
అపకీర్తిని అందినట్టి
అభిశాపము చెందినట్టి
అభిమానవతి గతివోలె

కనిపించె సీతమ్మ
హనుమ నేత్రమ్ములకు
అనిపించె హనుమకును
జని ధన్యమైనట్లు

శ్రీఆంజనేయుండు
సీతమ్మ స్థితి గాంచి
విలపించి విలపించినాడు
తలపోసి తలపోసినాడు!

అంతః పురాలలో
హంసతూలికలందు
శయనించు సుకుమారి
జనకరాజ కుమారి

స్థితి గాంచి విలపించినాడు
సీతమ్మ దశ గాంచి పలవించినాడు!

ఈ కటిక రాలలో
ఈ చెట్టు నీడలో
తూలి పడిపోవుచును
దుఃఖించు జానకీ

స్థితిగాంచి విలపించినాడు
సీతమ్మ దశగాంచి పలవించినాడు!

భోగాలు అమితాను
రాగాలు పాదప
రాగాలుగా త్రోసి
యోగమూనిన తల్లి

స్థితిగాంచి విలపించినాడు
సీతమ్మ దశగాంచి పలవించినాడు!

దశరథ మహారాజు
తగ పెద్ద కోడలు
ధన భోగములు వీడి
తాపసీవ్రత నైన

స్థితిచూచి విలపించినాడు
సీతమ్మ దశగాంచి పలవించినాడు!

కన్నీటి కెరటాల
మున్నీటి పెనుగాలి
బ్రతుకు పడవను త్రోయు
రామచంద్రుని రమణి

స్థితి చూచి విలపించినాడు
సీతమ్మ దశగాంచి పలవించినాడు!

వర్ష బిందువు గోరు
వాన కోయిల రీతి
భర్తనే ధ్యానించు
భామినీ తిలకంబు

స్థితి గాంచి విలపించినాడు
సీతమ్మ దశగాంచి పలవించినాడు

చంద్రవదనను గాంచి
చంద్రశిలలు ద్రవించె
చంద్రవదనను గాంచి
చంద్ర కాంతులు జారె!

రామచంద్ర స్మరణ
వ్రతదీక్షలో తల్లి
ఓర్పు నేర్పులు గాంచి
తూర్పు దిశ తెలవారె

వేద ఘోషలు సాగె
వివిధ ఘంటలు మ్రోగె
రావణుడు మేల్కాంచె
రాక్షసము మేల్కాంచె!

అతినీచ బుద్ధితో అతి వ్యసన శీలుడై
అష్ట హాసాలతో అరుదెంచుచున్నాడు
కామాంధకారాన కన్నుగప్పినవాడు
పరదార జానకిని పట్టనెంచినవాడు

అతడు వచ్చు వార్తలు విని
హడల జొచ్చె మన జానకి
అతని భటుల చేష్టలు గని
అవగతమయ్యెను పికవాణికి

మతిపోయెను సీతమ్మకు
గతితప్పెను నవ నాడులు
మనసులేని కనులుచూచె
కనులు లేని తనువుచూచె

మనసు ఎగిరి పక్షివోలె
తన నాథుని చేరుకొనెను
తనువు పడెను రాయివోలె
వని అశోకవృక్షము కడ

శోకాంబుధిలో మునిగెడి
నౌకవోలె కంపించెను
చెట్టునుండి రాలిపడిన
చిట్టికొమ్మ అనిపించెను

క్షీణించిన ప్రజ్ఞవోలె
రాణించని కార్యము వలె
నెరవేరని ఆశవోలె
తరిగియున్న వెన్నెలవలె

కరి కలచిన పద్మిని వలె
సిరి విడిచిన పద్మము వలె
రాహువు పట్టిన శశివలె
బాహువు జార్చిన మణివలె

త్రొక్కబడిన పూవుపోలె
చిక్కుపడిన శారికవలె
ఆరియున్న అగ్నిపోలె
పేరుకున్న చీకటివలె

శిథిలమైన కీర్తిపోలె పృథివిపడిన తారకవలె
ఎండినట్టి ఏరుపోలె తిండిలేని బాలికవలె
శోభదక్క మదిని సొక్కిసొక్కి మిగుల
దుఃఖితమతియయ్యె తోయజాక్షి సీత!

సోమకాసుర ముఖము
చూచి గడగడ లాడు
ప్రేమామృత పునీత
వేదమాత విధాన

సీతమ్మ గడగడ వణికిపోయింది
చేతమ్ము దడదడ కొట్టుకాడింది

భువిని చాపగచుట్ట
ముందుకురికిన దనుజు
గాంచి తత్తరపడెడు
తన్వి సుందరి విధాన

సీతమ్మ గడగడ వణికిపోయింది
చేతమ్ము దడదడ కొట్టుకాడింది!

అల హిరణ్యకశిపుని
ఆగ్రహము తిలకించి
విలవిలా కొట్టుకొను
విష్ణుభక్తుని మాద్రి
సీతమ్మ గడగడ వణకిపోయింది
చేతమ్ము దడదడ కొట్టుకాడింది!

కార్తవీర్యార్జునుని
ఖడ్గ హస్తము జూచి
ఆర్తి కుందెడి పరాని
ఆవు తల్లి విధాన
సీతమ్మ గడగడ వణకిపోయింది
చేతమ్ము దడదడ కొట్టుకాడింది!

బంధింపబడియున్న
పన్నగాంగన పోలె
నడ కొండ అడ్డగా
సుడిగొన్న నదివోలె
సీతమ్మ గడగడ వణకిపోయింది
చేతమ్ము దడదడ కొట్టుకాడింది!

నిట్టూర్పు గాడుపుల్
నిప్పులు గ్రక్కంగ
చెట్టుకడ నొదిగొదిగి
సీత ముడుచుకయుండె
సీతమ్మ గడగడ వణకిపోయింది
చేతమ్ము దడదడ కొట్టుకాడింది!

12)

# ప్ర లా ప ము

కాముకుండు రావణుండు
రామవిభునిపత్నితోడ
దుఃఖితయగు సీతతోడ
దురుసుగ మాట్లాడసాగె

నను జూడ భయ మేల
నా మనోహారిణీ!
నిను కోరి భజియింతు
వనితా శిరోమణీ!

అసితేక్షణ విలాస
మసమానమే నీది!
సుమబాణ విన్యాస
రమణీయమే నీది!

దరహాసరుచి రతిని
పరిహాస మొనరించు
వికచారవిందాక్షీ
విలసిత విశాలాక్షీ!

నిండారు పాలింక్ల
నిక్కు కన్పడకుండ
మోకాళ్ళు కప్పుకొని
ముడుచుకొందువదేల

రాకానిశావేళ రాజకాంతులలోన
ముకుళించుకొను తమ్మి పూమొగ్గ చందాన
ఈ సుందరోద్యాన మింపుసొంపులు నీవు
చూచియుండగలేదు చూడ చైత్రరథమ్ము!

ఏ వనములో లేని పూవు లిచ్చట గలవు
నందనమ్ముల లేని అందాలు గలవిందు
పదునాల్గు లోకాల ముదితలెందరొ నన్ను
కామించి పూవిల్తు కాకలకు లోబడిరి!

కామమే మూలమ్ము కామినీజనమణీ!
సృష్టి కార్యమునకు చిత్తజుడె కేంద్రమ్ము
నీపైని తమిలేని నీతిహీనుడెవండు
నీ ప్రేమతో సృష్టి నిండారు సతతమ్ము!

ప్రేమించు పురుషుండు ప్రియురాలి వాంఛలను
తీర్చెడి సమర్థుడై తేజరిల్లగవలెను
చిన్ని లేడిని తెచ్చి చెలికోర్కె తీర్చుటకు
సామర్థ్యమే లేని సామాన్యుడా ప్రియుడు?

తెలివితేటలు లేక కలిమి పోగొట్టుకొని
కఠిన కాననమందు కంద దుంపలు తినుచు
కటిక కొండలపైన కాళ్ళరుగ తిరుగాడు
అడవిమనిషిని ఎట్టి అడదియు కోరదే!

నా భోగభాగ్యాలు నా ప్రాభవోన్నతులు
ఊహించు మొకసారి ఉర్వీజా! నీ హృదిని
పదునాల్గు లోకాల ప్రభువులెల్లను మ్రొక్క
సార్వభౌమపదమ్ము సాగించుచున్నాను!

నీవు కోరినదెల్ల నిముసమ్మలో తెత్తు
ఎట్టి వస్తువునైన ఎట్టి ప్రాణులనైన
నీ పాదములతోడు నీలసుందర చికుర!
నామాట నమ్మవే నా ప్రాణసుందరీ!

అన్నివిడి నీవు రమ్మన్న చోటుకు వత్తు
దేవదేవివి నీవు దీనభక్తుడ నేను
ఈ భవాంబుధిలోన ఈ వియోగాబ్ధిలో
ఈద లేకున్నాను ఎటులైన దాటింపు!

నీ కటాక్షమూ చాలు నిలువెల్ల పులకింతు
నీపాద సేవకుడ తాపమ్ము తీర్పుమా!
స్వర్ణదీ తీరాల పూర్ణ శశి చంద్రికల
నందనారామాల సుందరీ! నాతోడ..

విహరింపగా రమ్మ వినువీధి మార్గాల
పుష్పకమ్ములపైన పుష్పశయ్యలపైన
జవ్వనము సుందరీ జలజాలా ప్రవహించు
సెలయేరు వంటిదే నిలచి యుండదు వినవె!

బైరాగులను కలిసి బైరాగి యైనావు
నీ మగడు ఎప్పుడో నిన్ను మరచాడె!
బైరాగి నీమగడు బైరాగి కాదు వే!
ప్రాయమ్ము వ్యర్థముగ పాడుచేయగ తగదు!

ఐన నీమగడెంత అతగాని బలమెంత
అంగబలమూ లేదు అర్థ బలమూ లేదు
కన్నెత్తి నావైపు కాంచుటకు గుండెలా
ఇంద్రాది దేవతలు ఇపుడు నా బానిసలు!'

మోహములోకాలలో మొనగాడనని నాకు
ఎదురు నిల్చినవాడు ఇంతవరకును లేడు
సుందరీ! వికచారవిందాలు నీకనులు
సౌందర్య దీపికలు కందర్ప బాణములు!

వైరాగి సొక్కాడు పైదలీ! నీ సొగసు
మతిమంతులకు కూడ మదనతాపము కూర్చు
నన్ను కాదన్న నే నిన్ను వీడను బాల!
ఉస్పైపై ప్రాణాలు ఉండనీ! ఊడనీ!

నన్ను కూడక తప్పదెన్నినాళ్ళకునైన
నన్ను వరియింపవే నవనవోజ్జ్వల మూర్తి!
పరదార పరధనము పరమతము హరియించి
భోగించుటే మాకు పూజ్యమౌ ధర్మమ్ము!

హరి ధనము హరి మతము హరి పురము హరియించి
అరి సమూహము త్రోలి చరియింపదగు మాకు
నన్ను కోరే వరకు నిన్ను ముట్టను నమ్ము
మదన తాపము నన్ను మసి చేసినను కూడ!

హాయిగా నామాట లాలకించి సుఖించు
ఈ రత్నభవనాలు ఈ హంసతల్పాలు
అనుభవించుము నన్ను మనసార ప్రేమించి
భర్తగా నను కొలిచి బహుళ సౌఖ్యము లందు!

బ్రహ్మకైనను కామభావమ్ము కలిగించు
అందాలు నీవి ఆనందాలు చేకూర్చు
సౌందర్యమయమూర్తి సౌదామినీ స్ఫూర్తి
శతపత్ర రుచినేత్ర అతి విచిత్ర చరిత్ర!

నన్ను కామింపవే నన్ను ప్రేమింపవే
నీకేది కావలయునో! కోరుకోవే!
నా వనమ్ముల విరియు నవవసంతము లెపుడు
నా వీటిలో కురియు నాకసౌఖ్యము లెపుడు!

నా వైభవోన్నతికి నా ప్రాభవద్యుతికి
నీవాధిపత్యమ్ము నిజము ఇది సత్యమ్ము!
నన్ను ప్రేముడి జూడ నవ్య భోగాలలో
ముంచివైచెద నిన్ను మించువారుండరిక!

నా ప్రభుత్వమునకు నా ప్రతాపమునకు
మూడు లోకాలలో ఈడు లేనేలేదు
నాకత్తి కెదురేది నాక లోకము నుండి
ఏలోకమందైన ఏజాతియందైన?

దేవ దానవులైన దిగధీశులైన
గరుడ గంధర్వాది ఘన శూరులైన
కాలిగోటికి కూడ పోలరే చాన
కన్నెత్తి గనలేరు ఘను లెవ్వరైన!

నా యింటిలో వీచు నవ మారుతమ్ము
నా ముంగిటను గాచు కౌముదీ ప్రభలు
నీవారు నిల్చెదరు ఏవారి కందనివి
పెద్ద స్థానాలలో పెద్ద పదవులలోన!

నీవు నీ బాంధవులు నిండు సంతోషమ్ము
పొంద నందుము చేయి పొల్పొందగాహాయి
త్రాగుతూ త్రేన్చుతూ తూగుతూ త్రుళ్ళుతూ
అనుభవింపుము అస్మదైశ్వర్య భోగాలు!

# మాతృహృదయము

సీతావధూమణీ
మాతృ స్వరూపిణి
కారుణ్య గంగాతరంగిణి
పారుష్య కలుషాపహారిణి!

అసుర ప్రలాపాలు
అనైక ప్రసంగాలు వినలేక వినలేక
అంగ విన్యాసాలు
వెంగలి విలాసాలు కనలేక కనలేక

మూసికొన్నది చెవులు మూసికొన్నది కనులు
మూగవోయెను మనసు మూర్ఛపోయెను తనువు
సీతావధూమణి మాతృ స్వరూపిణి
చిరునవ్వు నవ్వినది సిరిమల్లె పూచినది

చిరునవ్వు నవ్వినది చల్లగా చూచినది
మెల్లగా పల్కినది మీగడల్ చిల్కినది!

దుడుకుగా మాట్లాడు కన్న
కొడుకును చూచు తల్లివలె
తండ్రితో పోరాడు నరక
దనుజుని చూచు ధాత్రివలె!

కోపమన్నది లేదు తాపమన్నది లేదు
ద్వేషమన్నది లేదు రోషమన్నది లేదు
ఆమె చూపులలోన ఆమె చిత్తములోన
ఉన్నది పవిత్రత! ఉన్నది రసార్ద్రత!

దేవరిపు రావణుని తృణముగా ఎంచినది
తృణముగా చూచినది తృణముతో పల్కినది!
"ఓరీ తృణమ! బుద్ధి నీకున్నదికదా సుంత
అంత కూడను లేదు అమరారి కిది వంత

పాడుపాదాలతో పశువులును త్రొక్కినా
మానుమాట్లాడవే మర్యాద విడనాడి
క్షుత్ బాధతో పశువు కొరికి నిను మేసినా
కొరకొరా చూడవే కోపింపవే సుంత!

అధిపతులు గావించు ఆగడాల్ కంటివా
బుద్ధిజీవుల వెర్రి పోకడలు చూచితివ!
ఈశ్వరుడు బుద్ధిబల మిచ్చినది ఇందుకా
ఈశ్వరుడు వాక్ స్ఫూర్తి ఇచ్చినది ఇందుకా!

గడ్డిపోచా! రేగి కనులలో పడబోకు
గడ్డిపోచా! ప్రజకు కంటకము కాబోకు
కంటకమువైన నిన్ కాల్చి మసి చేసెదరు
ముప్పు తలపెట్టితివ ఉప్పుమని ఊదెదరు!

ఎగిరెగిరి పడబోకు ఎగిరిపోయేవురా
తెగ నీల్గబోకురా తెగటార్చబడెదురా!
నీ మనసు మరలించు నీ స్త్రీల వైపునకు
నీకు నీ కులమునకు నిందు మేలౌనగూడు!

పరభార్య నాశింప బంధు నాశము కల్గు
అవమానమును కల్గు అవివేకి కాకురా!
నీ భార్య నెవరైన నిర్బంధ మొనరింప
నీ హృదయ మెట్లుండు నీ వింత యోచించు!

పుట్టిల్లు నాకెంతో మెట్టినిల్లును నంతె
రెండును పవిత్రములు రెండు నానేత్రములు
నీవు నీ జనముతో నిఖిల సంపదలందు
నన్ను నాభర్త నానందముగ నుంచనీ!

మాతృదేవత నేను మంగళాంగిని నేను
కన్నతల్లిని భిక్ష కామించునా! మూర్ఖ!
సప్త సముద్రాల జలమింకి బీటైన
చండమార్తాండుండు చల్లబడిపోయిన

స్పర్శగుణమును గాలి వదలిపెట్టిన గాని
వహ్ని తన తేజమ్ము వదలి నుసినుసియైన
శైత్యమ్ము విడనాడి జలము మారినగాని
రవిని వీడదు ఛాయ రాము వీడదు సీత!

ఆ రామచంద్రుడే ఆ పరంధాముడే
ఆ సత్యమూర్తియే ఆ నిత్యపురుషుడే
నా మనోవల్లభుడు నా ప్రాణనాయకుడు
నా జీవనజ్యోతి నాసుగతి! నాజగతి!

ఆత్మయున్నన్నాళ్ళు ఆరాముడే కర్త
శ్రీరాముడే భర్త శ్రీరాముడే విభుడు
శ్రీరామచంద్రుండు చెలువారు భూరుహము
భూరుహము నల్లుకొను పూలతీవను నేను!

రామచంద్రప్రభువు రాగరంజితవీణ
ఆవీణ నంటుకొని అలరు తంత్రిని నేను
శ్యామసుందరమూర్తి అందాల మేఘమ్ము
మేఘమ్ముపై మెరయు మించు తీవను నేను!

శౌర్య ధుర్యుండైన సూర్యవంశు రాముడు
సూర్యదేవుని లోని శుభ్రకాంతిని నేను
అరవిందనేత్రుండు సరసంపు చిగురాకు
చిగురాకుపై మెరయు నిగనిగారము నేను !

సౌమిత్రి అగ్రజుడు సాక్షాన్మహావిష్ణు
ఆ విష్ణుప్రియురాలు ఆదిలక్ష్మిని నేను
శ్రీరామమూర్తితో స్నేహమ్ము చేసికో
శ్రీకరమ్ముగ సుఖశ్రీలనుభవించరా !

నన్ను పంపుము నా మనోహరుని దగ్గరకు
నీకు శ్రేయముకల్గు లేకుంటె మరణంబె
అర్కకాంతకి జలము లావిరైన విధాన
ఆ రామశరములన్ హతమారెదవు నీవు

శరణాగతత్రాణ బిరుదాంకుడా ప్రభువు
చరణమ్ములన్ వచ్చి కరుణించ ప్రార్థించు
రాముండు గరుడుండు రాక్షస భుజంగాల
ప్రాణాలు హరియించు వాడు కాబోకురా

రణరంగమున వారు ప్రాణాలు విడిచెదరు
రాబందులవి శరీరాల మాంసమును తిను
బంగారులంక నీపాపిష్టిబుద్ధిచే
సర్వనాశనమగును గర్వించ తగదురా!

ఇంత వీరుడవైన ఏ భయము లేకున్న
ఏలరా నను దొంగిలించుకొని వచ్చితివి?
చోరుడవా ! పెద్ద వీరుడవా ! రాము
డెదురైన నీ అసువు లెగిరిపోయెడివిరా!

నా మాట విను మంచి నడత అలవర్చుకో
అని తల్లి పల్కెనది తృణముతో పల్కెనది
ఆ మాటలకు అసురు డాగ్రహముజెందాడు
కామ గర్వాంధుండు క్షేమమార్గము గనడు

మంచి చెడ్డయు మరచి మత్తుమన్మత్తుడై
మానినీమణితోడ మాట్లాడె నీరీతి
"నన్ను బెదిరింతువా ? నన్ను దడిపింతువా?
నట్టి మాటలు మాని చెట్టపట్టుము నన్ను

నీ మనసు మార్చుకో నా మహిమ తెలిసికో
ఈ లంక నేలుకో ఇకనైన మేలుకో
ఆదిశక్తి విధాన వేదవతి చందాన
వేషాలు వేయకుము రోషాలు పెంచకుము

నా మాట వినకున్న నా క్రోధ తాకున్న
నిన్ను చంపుట నిజము నిను భుజించుట సహజము"
అని పల్కె దానవుడు అమిత ఖేదము పొంది
కనులెర్రనవడ నిలిచి తనస్త్రీల గని పల్కె

మహిజాత ఈలలన మనసు మార్చుడు వేగ
నా మదనతాపమ్ము నన్ను కాల్చుచునుండె
కామ మీడేర్చుడు కామినీమణులార !
స్వామికార్యము వేగ సాధించలేరటే !

ప్రియ సామమున కాని భేదమున కానిచో
దానమున కానిచో దండ ముపయోగించి
మార్గమేదైనసరె మా వశముగావలెను
మానినీమణి మనసు మార్చివేయుడు మీరు।

కాంపహారణము సేయు కాముకోర్చుటలేదు
ఈ నాతిపొందుకై ఏనాటనుండియో
ఎదురుచూచుచునుంటి ఏమి భామామణీ?
అని జానకీమణిని తినునట్లుచూచాడు

ధాన్యమాలిని మాట విన్నది
మాన్యమార్గము ఎంచుకొన్నది
ప్రాణనాథుని మనసుబట్టి
పలుక సాగినది!

ఆమెతో నీకేల
అందాల నారాజ!
ఆ అమాయకురాలు
అబల మానవురాలు!

ఉపవాసముల చిక్కి
ఉస్సురుస్సనుచుండె
నీ కోర్కెబరువునకు
నిలువ గ్రుడ్లిడునేమొ!

అసువులే విడునేమొ
ఆ పాపమదియేల?
అన్యకాంతల కొరకు
ఆరాట పడనేల!

వాంఛ నీపై లేని
వనితతో భోగింప
ఏమి సుఖమూ నీకు
ఏమి తృప్తియు కల్గు?

నీయందు మనసున్న
నీరజాక్షిని పొంద
తనువునకు సుఖమబ్బు
మనసునకు హాయియగా!

నాతోడ గావించు
నానావిధాలైన
కందర్ప సమరాలు
కందర్పదర్పహార!

మదనసౌఖ్యామృతము
మనసార గ్రోలుమా
ఇహపర భోగాలు
అహరహమ్మును పొందు!

చౌసీతిబంధాలు
ఈ సీత ఏమెరుగు
ఈ ధాన్యతో నీవు
ఎడతెగక సాగించు

శృంగారరసరాజ!
హేమాద్రి ధీర! ఒక్క-
అంగనామణి కొరకు
భంగపడ నేలరా?

అని కౌగిలించి తో
డ్కొనిపోయె రావణుని
అంతఃపురమ్మునకు
ఆ ధాన్యమాలిని!

# కటుభాషణ

సీత చుట్టూ ఉన్న
చేడియలు దరిజేరి
చెప్పసాగిరి గొప్ప
చెప్పసాగిరి ఇటుల

ఓ సీత! నా మాట వినవె
ఓ విశాలాక్షి! ఓ సుదతి!
మా మహారాజవల్లభుని
మనసు కెక్కిన మహిళ!

చెలి సుంతే మామాట వినవె
ఇల సమున్నత పదము గొనవె
తులలేని భోగాల మనవె
తులతూగి మము కరుణగనవె!

మా ప్రభువు రావణుడు
మంచి మనసు గలాడె
పౌలస్త్యుడే నీకు
వరణీయుడౌ సీత!

వేల సంఖ్యల నున్న
విరిబోణులను వీడి
నీపొందు కోరుచున్నాడె!
నీయందు మనసున్నవాడె!

దేవ గంధర్వాది
ధీరులను వీరులను
రణములో దునుమాడినాడె
రాజలోకము మించినాడె!

దిక్పాలకులు సదా
తిరుగాడు భటులుగా
పదసేవ లందుకొనువాడె
మృత్యుదైన మనసుగలవాడె!

తగుమాత్రముగ నిచట
మొగులు వర్షిస్తాయి
తగుమాత్రముగనె ఆ
తపములును కాస్తాయి!

మా మాట వినివేగ
మా ప్రభువు వరియించు
అనుభవించు మహేంద్రుడు
నైశ్వర్య భోగాలు!

రాముడే మెరిగించు రాజ్యహీనుడై వాడు
రసరాజమూర్తి మా రావణుని పెండ్లాడు
రాజసము తలకెక్క రాజులకు నెక్కినా
ఆ శదానికి ఇంత అతిశయము తగునటే!

బ్రహ్మదేవుడుకూడ బహుగౌరవముతోడ
మాట్లాడుచుండునే మా రాజు కష్టైదుట
మా జేనితో నిటుల మాట్లాడుటా నీవు!
తలతీసినట్లుండె దానవులకెల్లరకు!

నీమాటలకు నిన్ను నిలువునా చీల్చదగు
మంచిభూపతి కనుక మానినీ! మన్నించె
సర్వలోకవిజేత స్వామి నీకింతగా
పనికిరాడాయెగా పనికిమాలినదాన!

స్వామి వంశంబేమి! స్వామిశౌర్యంబేమి!
స్వామి భాగ్యంబేమి! స్వామి యోగ్యతలేమి!!
ఆ స్వామి నినుగోర అలుకబూనెదవేల?
మన్నింపవే చెలీ మాస్వామి స్నేహమ్ము!

అది నీకు భాగ్యమ్ము అది నీకు యోగ్యమ్ము
ఎవరైన నీవలన ఎప్పుడైన సుఖపడిర?
నష్టజాతకురాల! కష్టకంటకమాల!
ఎవరైన నీవలన ఎప్పుడైన సుఖపడిర!

ఈశ్వరునికార్ముకము ఎక్కిడెడివానికై
వెతకివెతకీ నాడు విసివిపోయెను తండ్రి
ఈశ్వరునిచాపమ్ము ఇట్టె విరిగినదంచు
పరశురాముడు ఎంతో బాధపడె నీ వలన!

కానలకు వలదన్న గయ్యాళివై ఏగి
కోరరానివి కోర కుమిలిపడ్డెను భర్త
నీపైన వలపూని నిర్జరారి వహించె
స్మరవహ్నితాపమ్ము చాలుచాలే సీత!

# మనో నిశ్చయము

ఆ రామదూషణము
ఆ రక్కసుల నుడులు
వినలేక వినిలేక
అనె సీత గట్టిగా

"ఓ రాక్షసాంగనలార!
ఓ క్రూరవీక్షణలార!
దీనుడైనను ఉదాసీనుడైనను నాకు
రామచంద్రుడె భర్త రామభద్రుడె కర్త

రాజ్యహీనుండయిన రామచంద్రుడె భర్త
ప్రాణాలతో నెపుడు నే నోముల ముట్టుకొన
భాస్కరుని విడనాడి ప్రభ యుండునా జగతి!
ప్రభను భాస్కరుని వేరుపరచగలవారెవరు?

రాముడే నా ప్రియుడు రాముడే నా విభుడు
నన్ను విసిగించకుడు నన్ను బాధించకుడు
నను బాధపెట్టి నా మనసు గాయము సేయ
క్రోధాగ్నిలో లంక కుమిలి బూడిదయగును

మర్మాంతకములైన మాటలు వినజాల
నను మీరు కోసినా నన్నేమి చేసినా
పతి యేమిగాడ సతికి పతియె సర్వస్వమ్మొ
సతి పరుని కనలేదు పతినింద వినలేదు!

బ్రతుకంత కావలెను పతిసేవ కంకితము
ఇది సత్ ధర్మమ్ము ఇది లోకధర్మమ్ము
నేనే ప్రభామణిని నా నాథుడే ద్యుమణి
నేనే శచీమణిని నా నాథు డింద్రుండు!

నేనేను రోహిణిని నా నాథుడే శశి
నేనే సుకన్య నా నేతయే చ్యవనుండు
అన్యుని వరింపను ఆత్మాధిపతి ఒకడె
అతడె నా రాముండు అతడె నా నాథుండు

శ్రీరాముడే రక్ష శ్రీరాముడే శిక్ష
శ్రీరాముడే భర్త శ్రీరాముడే కర్త
సావిత్రి మదినమ్మి సత్యవంతుని కొలిచె
దమయంతి నైషధుని తమి మీరగా కొలిచె

మదయంతి సౌదాసు ముదమూరగా కొలిచె
శ్రీమతి కపిలుని శ్రేష్ఠమ్ముగా కొలిచె
ఏది పతివ్రతా మోదమైన పథంబొ
అదె నాకు చెలులార అనుసరణీయంబు"

అది వినుచు రాక్షసాంగనలు
అవహేళనము చేసినారు
సీతమ్మ చుట్టునుజేరి
భీతిగొల్పగ చూచినారు

గోమాత చుట్టును భయద
క్రూర మృగములు ఆడినట్లు
వికటమ్ముగా నవ్వినారు
ఎకసక్కెములు పల్కినారు

'చీల్చి చంపెద' నంచు ఒకతె
'కాల్చి తిందు' నటంచు ఒకతె
'ముక్కు కోసెద' నంచు ఒకతె
'రక్కు పోసెద' నంచు ఒకతె

సుక్రూరాళి త్రుళ్ళుచూ భయద
శూలముల్ తెగ త్రిప్పినారు
ఖడ్గముల్ ఝళిపించి వినని
కఠినోక్తులే కూసినారు

కుచకుంభములు వ్రేల ఆట ని
కుంభినీ నాట్యమ్ము లోక
భీకరంబుగ చేసినారు
కేకలే మరివేసినారు

అదిచూచి సీతమ్మ వణికిపోయింది
పూబోణి సీతమ్మ మూర్ఛపోయింది
అలివేణి సీతమ్మ అలిసిపోయింది
సుకుమారి సీతమ్మ సొక్కిపోయింది

అదిచూచి పవనజుని
హృదయమ్ము పగిలిపోయింది
అదిగాంచి అనిలజుని
హృదయమ్ము రగిలిపోయింది

మారుతి కన్నీరు
ధారగా కారినది
ఏరుగా పారినది ము
న్నీరుగా మారినది!

శింశుపా వర శాఖ
చేతితో పట్టుకొని
ఆ రామ 'హారామ'
యంచు విలపించినది

అశ్రులను తలచుకొని
ఉత్రలము చెందినది
పిచ్చికోర్కెకు ఫలము
ఇచ్చె భగవంతుడనె

రామచంద్రుని తప్పు
రవ్వంత లేదు ఇది
తన కర్మ ఫలమంచు
తలచుకొని విలపించె

తరుశాఖ వైపునకు
తలయెత్తి చూచినది
నెరివేణి చేతితో
సరిచేసి చూచినది

ఆ లోచనాలలో
అలరాదు ఆలోచనలేమొ
లలిత హృదయములోన
విలయాగ్ని గిరులెన్ని ప్రేలెనో!

తరుణి మెడ నల్లజడ
త్రాచుగా త్రాడుగా తోచినది
ఆత్మలో ఏమేమి
అనుకున్నదో నేలచూచినది!

# సుస్వప్నము

త్రిజట మేల్కొని పల్కె - స్త్రీలారం! కలగంటి
వేకువన కల కదా వినుము నిజమూగదా!

చంపబోకుడు చంపబోకుడు
చంపదలచిన నన్ను చంపుడు
చంపకాంగిని చంపితే మన
కొంపలంటుకొనున్!

రయము రయమున చేరరండు
భయము గొలిపే స్వప్నమందు
నయనములతో గాంచితిని సం
శయము లేదింతన్!

నేటి వేకువవేళ రాజుకు
చేటు కలిగే కలనుగంటిని
ఓటు కాదే కల నిజంబగు
మాట వినలేదా!

మెల్లమెల్లగ నడచి వచ్చె
తెల్ల ఏనుగు నొకటి గాంచితి
ఎల్లదిక్కుల దంతకాంతులు
వెల్లుబుకుచుండెన్!

భద్ర దంతావళము కైలా
సాద్రి మాద్రి మనోహరంబయె
భద్ర పురుషుడు వీరికడ ని
ద్రదు డొకడుండెన్!

అందగించెడి చప్పరంబున
మందహాసము చేయుచుండెను
సుందరాంగుడు చెంత తమ్ముడు
నందనము సేయన్!

పాలసంద్రము పొంగుచున్నది
గాలి చల్లగ వీచుచున్నది
బాల ఒక్కతె కడలిగట్టున
హేలగా నిలిచెన్!

అలలు ఎత్తుగ లేచుచున్నవి
తళతళలు చెలరేగుచున్నవి
జలధి మధ్య నగమ్ముపై చెలి
మిలమిలా మెరిసెన్!

ఈమె పదములె ఈమె కరములె
ఈమె మోమే ఈమె కన్నులె
ఈమె రూపమె ఆమె రూపము
ఆమె ఈమె యగున్!

కరిని దిగి చెలి యున్న చోటుకు
అరిగి అనిపతి అంగనామణి
వన కరాబ్జము లంది ముదమున
ఉరమున్నైకొనియెన్!

శ్యామ శ్రావణ మేఘమున సౌ
దామినీ వరరేఖ పోలిక
రామరాడ్విభు వక్షమందున
భామ కనిపించెన్!

వారి జంటను చూచినప్పుడు
వారి కలయిక గాంచినప్పుడు
వారి ప్రేమకు నాశరీరము
'ఔర' పులకించెన్!

కిసలయాంచిత శాఖయందున
మిసిమిగల గజనిమ్మ పండుగ
కిసలయాధర శ్యాము సందిట
గుసగుసలు పోయెన్!

హారికరంబుల జానకీమణి
హారిత పల్లవ పత్రసంపుటి
వరసువర్ణసుమమ్ము మాదిరి
ముదు వృచిందించెన్!

రామచంద్రుడు జానకీమణి
సామజముపై అధివసింపగ
వామలోచన కన్నుసన్నల
సామజము నడచెన్!

చామరము లక్ష్మణుడు వీవగ
రామచంద్రుని అంకతలమున
వామలోచన మూడుజగములు
క్షేమముగ చూచెన్!

అంత సీతారాములప్పుడు
కాంతి ఛాయా సూర్యులట్టుల
కాంత రోహిణి చంద్రులట్టుల
స్వాంతమున దోచెన్!

తెల్ల మబ్బులు రామసీతల
తెల్ల చలువల చీరలట్టుల
మల్లె పూవుల చెండులట్టుల
ఎల్లలను ప్రాకెన్!

చుక్కలన్నీ రామసీతల
చక్కదనముల నినుమడించే
చెక్కడమ్ముల సొమ్ములట్టుల
దిక్కుల వెలింగెన్!

సూర్యచంద్రులు తారకలు సౌం
దర్య నిధులై రామచంద్రుని
భార్య మంజీరముల కలరవ
తూర్యములు నింపెన్!

కొంతసేపు మరల్చి చూడగ
దంతి, రాముడు లక్ష్మణుండును
సంతయును కనుపించ రంతా
కాంత స్వాపంబే!

కాలిగోళ్ళు తారలయ్యెను
ఫాలతిలకము సూర్యుడయ్యెను
చేలములు తెలిమబ్బులయ్యెను
బాలికామణికిన్!

కాంతకన్నుల కౌముదీప్రభ
లంతరిక్షము గ్రమ్మివైచెను
అంతరంగములంత నిండెను
ఎంత అందంబో!

నిండు పూర్ణిమనాటి రాత్రిర
పండు వెన్నెల నిండినట్టుల
నుండు నాయాము నవ్వు - కన్నుల
పండువే గాగన్!

రామ లక్ష్మణా సీతలంతట
కామదమ్మగు పుష్పకమ్మున
హైమ పర్వత దిక్కు వైపుగ
సీమలను దాటెన్!

రామచంద్రుడు విశ్వమయుడై
భూమి గగనము పట్టుకుండెను
ఆ మహాత్ముడు మ్రింగుచుండెను
భూమి సర్వంబున్!

కాంతి పెరిగెను జగతి కరిగెను
భ్రాంతి తొలగెను శాంతి కలిగెను
వింత వెలుగే విశ్వమంతయు
సాంతముగ నిండెన్!

అంతలో మన దనుజనాథుడు
వింతగా కనిపించినాడే
కాంతిదక్కియు నైక మెక్కియు
వంత మునిగినటుల్!

శైల లేపన వికృతరూపుడు
నైల వస్త్రపరీత గాత్రుడు
శైల కందర పాదచారుడు
మైలపడినయటుల్!

రథము నుండియు నీడ్చబడి - జన
పథము నుండియు తరుమబడి - బహు
వ్యథల గుందుచు బిక్కుబిక్కున
మథన పడుచున్నటుల్!

నూనె త్రావుచు బురదగుంటల
తానమాడుచు చేతికర్రల
బూని లేచుచు పిచ్చివాడయి
గ్లాని చెందినటుల్!

గాడిదెక్కెను దానిగొంతుకు
త్రాడు వేసెను ఆకదొక్కటి
బాడెలోపడి దక్షిణాశన్
బూది అయిపోయెన్!

కుంభకర్ణులు మేఘనాధులు
కుంభినీ కుచకుంభములబడి
రంభకోరకై దీర్ఘనిద్రకు
జృంభణము చేసెన్!

విజయదుందుభి మ్రోగుచుండగ
ధ్వజము పట్టుక మంత్రి నడువగ
గజముపైన విభీషణుండిట
ప్రజల నురేగెన్!

పరిమళోదిత హారములతో
సరసిజాక్షుని దీవెనలతో
ధర విభీషణు డధివసించెను
పురమహాసనమున్!

భగ్నగోపురమయముగా పురి
నగ్నికాహుతి చేయుపనిలో
మగ్నమానసుడైన కపి ఉ
ద్విగ్నమతియయ్యెన్!

సురవిరోధులు విరథులై పెను
దురములోపల వారినెత్తురు
దోసపురందున చెలపులంచున
వరదలై పారెన్!

పంకజాక్షుడు వానరులతో
లంకరాజును చంపివైచియు
పంకజాక్షినిగూడి సాగ అక
లంకచరితుడయెన్!

చంపబోకుడు చంపబోకుడు
చంపవలసిన నన్ను చంపుడు
చంపకాంగిని చంపితే మన
కొంపలంటుకొనున్!

కల్లకాదీ కల నిజంబగు
ఎల్లరును విని నాకుపల్కులు
పిల్లదానిని ఏమి అనకుడు
చల్లగా మనుడున్.

"కలలోన కనుగొన్న కనకమ్ము నిజమా?
ఇది అంతే" అంచు హసించె ప్రఘస
"నిద్రపట్టనివారి క్షుద్ర కల్పనలంచు
పకపకానవ్వుచు పలికె వికట

"కలలోన కోతిని కనగొన్న వారికె
అశుభంబు చేకూరు" ననెను విజాత
"మంట కన్పడిన కుమార్తె సమర్తాడు"
నని పల్కి పరిహాసమాడె విమత

"పీడకల కాదు ముసలిది బెదరి మనసు
చెదరి అల్లిన కల" యంచు మువతులు మ
హాట్టహాసమ్ముచేసిరి గుట్టలందు
జవల మెకములు గుంపులై జడిసి పార

"మదమెక్కియున్నారు మందులగుచున్నారు
సవ్వభోకుడె మీరు నొవ్వ చెందెదరిలను
పక్షికూడా కూసె బల్లికూడా అరిచె
రక్షించబడు సీత రాక్షసము వలదే!

రెండునెలలోర్పుగా నుండుడే సఖులార
జనకసుత జోలికిని చనబోకుడిక పైన
ఈ స్వప్నవృత్తాంత మెల్ల నిజమైతీరు
అని పల్కి జానకిని కనుగొనెను త్రిజట

నేలకొమరిత సీత నేలనే చూచినది
కాలిగోటిని కటికనేలపై రాచినది
"ఏమి చేసెద నింక నేను
ఏమిపాపము చేసినాను!

రామ! రఘూద్వహ రక్షింపవా! నన్ను
రాక్షసులు నాతనువు భక్షింపనున్నారు
ఎంతపాపము నేను ఎపుడుచేసితొగాని
ఇంత కష్టమువ్రాసె ఈశ్వరుడు నానొసట

రామరామా! ఏమి ప్రారబ్ధమోగాని
రాక్షసులతో స్వామి! బ్రతుకుతున్నాను
మృత్యువే శరణమ్ము గత్యంతరము లేదు
హృదయమా! పగలవే ఎంత కఠినమొ నీవు

ఇంత కాలమువరకు ఎట్లు జీవించితిని
కెంపునెలలకు నిన్ను ఖండించుకొనుమలిక
మాయావి నీచుడగు పాపీచు డెవ్వఁడో
శ్రీరామ లక్ష్మణుల నాశగించెనో యేమొ

లేకున్న నా ప్రియుడు శ్రీరామచంద్రుడు
భార్యనను కాపాడ పరుగెత్తుకొని రాడ
భూశయన దీక్షతో పుణ్యవ్రతాలతో
క్షమయె ముఖ్యంబంచు కాంతునే నమ్మితిని

నను చంపివేతురన
మనసులో భయమయ్యె
చంపివేసిన వేగ
సంతోషమేయగును

మానభంగముకన్న
ప్రాణహాని సుఖంబు
ఏమి భావింతురో రక్కసులు
ఏమిపని గావింతురో!

ప్రాణ నాయకుడిటకు
వచ్చు జాడయె లేదు
వైరమ్ము విడనాడెనో! ప్రభువు
వైరాగ్యమే బూనెనో!

ఏమెరుంగని వట్టి
నా మరందిని బట్టి
ద్రోహివని తిట్టినానే మిగుల
దుర్భాషలాడినానే!

అందుకై లక్ష్మణుడు
అరుదెంచడా! ఇటకు
ఆగ్రహమ్మబూనెనే నా మరది
నిగ్రహము విడనాడెనో!

నిగ్రహము విడనాడి
ఆగ్రహము బూనితిని
ఏగ్రహము వీక్షణమ్మో నాదు
వ్యగ్ర మానసనైతినే!

ఆ పాపమే నన్నీ
ఈ పగిది మిక్కిలిగ
కట్టి కుడుపుచున్నదో నన్ను
పట్టి నడుపుచున్నదో!

పొగరెక్కెనని యెంచి
భగవంతుడీ లంక
పడద్రోసి నను మరచెనో
పాపిష్టిదని విడచెనో!

కనులారగ అత్తలను
జనకులను మరదులను
మరి చూచుకొనజాలనా! ఈజన్మ
మరిగి మసికావలయునా!

ఈజన్మలోనింక
ఇనకులుడు కనపడడ
ఈజన్మ ఫలమింతేనా! స్వామి
నెప్పుడైన దర్శింతునా!

చనిపోవుటకు ముందు
చరమకాంక్ష యదొకటి
నారాముడగుపించునా స్వామి!
నాపైన కరుణించునా!

కాలకూటము లేదు
కరవాలమును లేదు
ప్రాణమ్ము విడుచుటెట్లా! నాదు
మానమ్ము దక్కుటెట్లా!

అని సీత దుఃఖింప కనిపించి అనిపించె
తన కేశజాలమ్మె త్రాడుగా మెలివైచి
గొంతుకురిపోసుకొని చింతలను బాయుదును
ఆత్మశాంతి లభించు అంధ తమము హరించు

వామలోచన కప్పుడు వామలోచన మదిరె
వామ ఊరువు నదిరె వామ భుజమును అదిరె
పైడి చీచెరంగు బహు స్వల్పముగా జారె
బ్రతుకుపై ఆశతో భావాంకురము కలిగె

శుభశకునములు అలరె
శోకమ్ము పైతొలగె
సంతోష ముప్పొంగి
సంతాపములు క్రుంగె

# అవతరణ

ఇది నా అదృష్టమ్మొ ఇది పూర్వపుణ్యమ్మొ
ఇట కంటి జానకిని ఇక్ష్వాకు శ్రీమణిని!
స్త్రీమాత్రి కాబట్టి క్షమకల్గి నిల్చినది
వైదేహి కనుకనే బాధలు భరించినది

ఇన్ని కష్టాలలో ఇన్ని దుఃఖాలలో
ఇట్టి రాక్షసులలో ఇట్టి బంధాలలో
నమ్మదుతె నాశల్ల నెమ్మనమ్మున నన్ను
ఈ స్థితిని ఎవరైన ఇట్లాట సహజమ్ము

శ్రీరామచంద్రుడే చెయ్యిదిగివచ్చినన్
దైతేయుడంచు సీతమ్మ శంకించు
ఎట్లు మాట్లాడవలె ఈ సతీమణితోడ
ఎట్లు నమ్మింపవలె ఈ జానకీమణిని!

ఈ వార్ధి లంఘనము ఇంత కష్టము కాదు
మాట్లాడ కేగుటయు మర్యాదయును కాదు
రామ ప్రసంగమ్ము రామ సంకీర్తనము
నొనగూర్చుచుండుటే ఒక సుగమ మార్గము

శ్రీరామచరితమ్ము నోరార పల్కెదను
రామ సంస్మరణమ్ము ప్రబలాఘహరణమ్ము
నామ మణిదీపమ్ము నాల్కపై నెలకొల్ప
బాహ్యాంతరములందు భవ్యకాంతులు చిమ్ము

చైతన్యరూపజ్ఞ సర్వజ్ఞురాలు ఈ
రామాధిపునిరాజ్ఞి ఈమాత్ర మెరుగదా!
రాక్షసులు వినకుండ రామకథ పల్కవలె
ఏ భాష భాషింతు ఎటుల ప్రారంభింతు

రామ కంఠస్వరము ఈమె కంఠారవము
మధురాతి మధురమ్ము మానసామోదమ్ము
రామసన్నిధి వెలుగు ఈమెసన్నిధి కలుగు
అనిర్వచనీయమగు అనుభూతి మదిచెలగు

శ్రీరామచరితమ్ము నోరార పల్కెదను
మదవతులపై మత్తుమందొండు చిల్కెదను
శ్రీరామగానమ్ము చేయసాగెను హనుమ
శింశుపా వృక్షమ్ము సీతపై పువ్వురాల్చె

చల్లగాలికిసాగి మెల్లమెల్లగసాగి
శ్రీరామగానమ్ము చెవికి విందొనగూర్చె
కొండంతబలము చేకూరె సీతకు అపుడు
మ్రొక్కుకొనె రామునకు మోడ్చి చేతులు రెండు

రాక్షసులవనములో రామగానంబేమి
మూర్ఖసంఘముమధ్య పుణ్యాచింతనలేల
అని సీత వెరగంది కనులెత్తి చూచినది
శింశుపా వృక్షంపు శీర్షాగ్రపత్రముల

ఒకసారి హనుమన్న ఉదయామణుని భాతి
కనిపించె హనుమన్న కనకపుష్పము భాతి
హనుమంతు డది తెలిసి ఆదిలక్ష్మిని తలచి
తనపూర్వ వృత్తాంతమును కనులతో చెప్పె

# సంభాషణము

శ్రీరామచరితమ్ము
చెప్పులార వినుడోయి జనులార!
కష్టముల్ తొలుగు అ
భీష్టముల్ నెరవేరు జనులార!

భరతఖండములోన పరమ సుందరమైన
వాసిగాంచినభూమి కోసలదేశమ్ము
సరయూనదీతీర సస్యకేదారాలు
శక్తికిని భక్తికిని భుక్తి కాధారాలు

కోసలము నవరత్నరాసులకు కేంద్రమ్ము
రాజధాని అయోధ్య ప్రబలరిపుల కసాధ్య
ఆ రాజ్యపాలకులు ధీరాధివీరులట
దాన ధర్మ జ్ఞాన దాక్షిణ్యమూర్తులట

గోసేవ దీక్షతో చేసెను దిలీపుండు
దానగుణ ఉత్కృష్టి తాజూపె రఘురాజు
దాంపత్యకళకు ఆదర్శమ్ము అజరాజు
ధర్మానుశీలుండు దశరథమహారాజు

ఆ రాజమౌళి భార్యామణులు ముగ్గురు
కౌసల్యయు సుమిత్ర కైకేయి అనువారు
కౌసల్య తనయుండు కల్యాణరాముండు
లక్ష్మణ శత్రుఘ్నులాసుమిత్రకు సుతులు

కైకేయి పుత్రుండు ఘనుడైన భరతుండు
వంశప్రదీపకులు వైరిసంహారకులు
శ్రీవిష్ణు హస్తముల కీర్తిగా నలువురును
దైవాంశజాతులై తనరారిరచ్చోట

సకలవిద్యలునేర్చి సకలధర్మములెరిగి
తాటకిని దునుమాడి దనుజులను చెండాడి
రామలక్ష్మణులప్పుడు ప్రబలులై మఖరక్ష
ణముచేసి మునుల మన్ననలను బడసినారు

శ్రీరామచంద్రుండు శ్రేయోభిరాముండు
శిలను చెలువుగచేసి క్షేమమ్ముచేకూర్చె
శివధనస్సును విరిచి సీతమను పెండ్లాడి
పరశురాముని గర్వభంగమ్ము గావించె

పితృవాక్యపాలనకు ప్రీతి రాజ్యమువీడి
లక్ష్మిసీతమ్మతో లక్ష్మణానుజునితో
దండకావని జొచ్చి దండించి క్రూరులను
వనవాసమొనరించి పడరానిపాట్లుపడె

భరతునకు పాదుకలు కరుణతో తానొసగి
చిత్రకూటమునుండి చేరె పంచవటికి
శూర్పనఖ కామాంధ దర్పమంతముచేసి
ముకుచెవులు కోయించి బుద్ధిగానుండుమనె

బంగారు లేడికై పతినంపి సీతమ్మ
మాయావి మాటలకు మదిచెదరి పతికొరకు
లక్ష్మణుని పంపించి రక్షణము లేకుండ
బిక్కుబిక్కున సీత ఒక్కతే కుటినుండె

యతివోలె రావణుడు
మతిలేక విచ్చేసి
దొంగగా రాముసతి
దోచుకొనివచ్చాడు

'భూమి జాతా!' యంచు
'ఏమె సీతా!' యంచు
చెట్టు చెట్టును వేడి
గుట్ట గుట్టను తడివి

పిట్ట పిట్టను అడిగి
బిట్టు బిట్టున కలగి
రాళ్ళు రప్పలు కరుగ
రామచంద్రుండేడ్చె!

కానలందునబడియు
కాళ్ళరుగ తిరుగాడి
అట జటాయువునకు
అపవర్గమిప్పించె!

శబరి ఆతిథ్యమ్ము
సత్కరుణ గ్రహియించి
సుగ్రీవ సచివుతో
శుభమైత్రి చేసికొనె!

వాలి ప్రాణముతీసి
వాలి తమ్ముని సకల
వానరేశుని జేసి
వానరుల ప్రీతిగొని

ఆ తల్లి సీతామతల్లి
అంజనా తనయుని చూచె
అతి బుద్ధిమంతుని చూచె
అతి సౌమ్యమూర్తిని చూచె

అ తల్లి సీతామతల్లి
అతి సత్వమూర్తిని చూచె
అమిత భీకరమూర్తి చూచె
అతి సూక్ష్మమూర్తిని చూచె

ఆ తల్లి సీతామతల్లి
అతి భక్తిమంతుని చూచె
అతి శక్తిమంతుని చూచె
అతి యుక్తిమంతుని చూచె

ఆ తల్లి సీతామహాలక్ష్మి
ఆశ్చర్యమొప్పగా చూచె
గీతమ్ము తనగీత మంచు
కించి దపేక్షతో చూచె

చేతమ్మునకు సుంత తగిలి
చిన్నారి మోమెత్తి చూచె
ప్రీతితో భీతితో మరియు
విస్మయమ్మునుపొంది చూచె

పింగారుణముతైన కురులు
సింగార మొలికించు చెవులు
పింగ వర్ణంబైన కనులు
బంగారమును మించు నొడలు

మందార పుష్పముగ తోచె
చెందామర విధాన తోచె
పగడాల రాశిలా తోచె
పద్మరాగమువోలె తోచె

ఉర్వీజమ్మును వీడివచ్చి
ఉల్లమ్ము బిగబట్టి హనుమ
ఎల్లదిక్కులు వీక్షచేసి
ఎవ్వారు లేకుండచూచి

అల్లంత దూరాన నిలిచి
అమ్మకాళ్ళకు వంగి మ్రొక్కి
మెల్ల మెల్లగ జేరి హనుమ
మేదినీసుతతోడ పల్కె

"ఓ తల్లి! లలనామతల్లి!
ఉన్నతాశయ కల్పవల్లి!
ఓ పుణ్య రమణీయశీలా!
ఓ అష్టమీచంద్రఫాలా!

ప్రాజ్ఞురాలా! ఒక్క
పుణ్యశీలను వెదక
వాస్థలను దాటితిని
వనములను జొచ్చితిని

దేశ దేశాలెల్ల
తెగతిరిగి వచ్చితిని
రాజభవనాలెల్ల
శ్రద్ధగా చూచితిని!

వనములో నినుగాంచ
అనిపించె నామదికి
నీ వసుంధతివేమొ
సావిత్రివో ఏమొ!

భూమాతవో ఆది
శ్రీమాతవో లేక
స్వాహానసూయామణివో
సాధ్వీమయా రోహిణివో

నే వెతకుకొనుచున్న
నిఖిలేశ్వరునిరాణి
శ్రీరామునర్ధాంగి
సీతాలలామవో!

దయచేసి చెప్పుమా
తప్పయిన క్షమియించు
తేజో నిధానమా!
దేవ పూజితపదా!

అనిన హనుమకు రామునర్ధాంగి కొంత
సందియమువోన చిక్కుప్రశ్నలను వేసి
కన్నులను జూచి హృదయపు సంగతి నెరింగి
పలికె సీతావధూటి సంభావ్యలీల!

ధర ధర్మ సంపన్నులైన
దశరథులవారి కోడలను
జనకమహారాజు కూర్మి
తనయను శ్రీరామసతిని!

సీతనాబరగు నాపేరు
శ్రీవారు పితృవాక్యపాల
నకు కానలకు రాగ వెంట
నామదది నేను వచ్చితిమి

పంచవటి నుండి రావణుడు
వంచించి గొని తెచ్చినాడు
రెండు నెలలిక గలదు గడువు
ఖండించెదరు వీరు నన్ను

అని మహీజాత ఒక్కింత తనను గూర్చి
చెప్పికొని 'రెండునెలలె ఈజీవిత' మన
చెవులు రెండుకరములమూసికొని పల్కె
ననిలజు "షమంగళము ప్రతిహతము నగుత!

అనకమ్మ పాపము శమించు
అనకమ్మ! పాపము శమించు
అది అసంభవమమ్మ - విభుడు
అఖిల సంరక్షకుడు గలడు!

నీ దర్శనముచేత
నేను ధన్యుడనైతి
ఏమందు నినుజూచి
హృదయముప్పొంగినది!

# ముద్రికా ప్రదానము

ఆనందరసధార అధికమై పారినది
మహనీయదైవమ్ము మంగళము కోరినది
అమ్మా! సుగ్రీవుండు అంపగా నినుగంటి
నేను ధన్యుడనైతి నేను గణ్యుడనైతి!

నీ మరది లక్ష్మణుడు నిను జూచినంతనే
అభివందనము చెప్పుమనినాడు జాలిగా
రామ స్వరూపమ్ము రామ స్వభావమ్ము
తెలిసినట్టులనుండు తెలియదెవ్వరికిని!

రాఘవుని పూర్ణానురాగమ్ము లేకున్న
స్వామితత్వముగూర్చి రామచంద్రునిగూర్చి
పూర్ణమ్ముగా చెప్పి మోదమ్ముగూర్చుటలు
సాధ్యమా నావంటి సామాన్యునకు తల్లి!

రామచంద్రప్రభువు రాజీవనేత్రుండు
విశ్వమోహనమూర్తి వీరాధివీరుండు
దర్శనీయుడు జనాదర్శజీవనుడమ్మ
శత్రుకర్శను డాత్మసద్విమర్శనుడమ్మ

రామచంద్రుడు విజితకాముడే మాతల్లి
చక్కనౌ బాహువులు జానుయుగ్మమునంటు
మోముపై చిరునవ్వు హాలుపాను నేత్రద్వ
కనినవాడెవడైన మనసమర్పణము సేయు!

సర్వాధికప్రభువు శాంతగంభీరుండు
నన్నంపినాడమ్మ నాప్రభువు దాశరథి!

రామదూతను రామనామజపనిష్ఠుడ
రామపదరసపూర్ణ రాజీవభృంగమును
రాముండు నాతండ్రి రాముండు నాతల్లి
రాముడే నాధనము రాముడే సర్వమ్ము!

నీ క్షేమవార్తలను నేనేగి చెప్పెదను
రాఘవుడునీముందు ప్రత్యక్షమౌతల్లి
రావణునిపరిమార్చి ప్రమదంబు చేకూర్చి
వానరులతోవచ్చి దానవులహతమార్చి!

కోదండరాముడై కోపమ్ముతోస్వామి
ఊగిపోతున్నాడు రాగిపోతున్నాడు"
అని తల్లినోదార్చ అనిలజుడు దరిచేరె
తల్లి సందేహించి 'దగ్గరకురాకోయి

"విపరీతవేషాలు వేయకుము రాక్షసా!
నను స్పృశించితివేని నాశనంబయ్యెదవు
యతివేషమును వేసి సతినన్ను వంచించి
యతులు వంచకులన్న అపకీర్తి తెచ్చితివి

భక్తుండుగావచ్చి భక్తులందున ద్రోహి
భక్తులున్నారన్న భ్రమనుకల్పించితివి
మంచివారిని అనుమానించునట్లుగా
మానవత్వమునకు హానికల్గించితివి!"

జనని సందేహభావ సంజనితవాక్కుల
వహ్ని సెగలకు మారుతిచిత్తకుసుమము
వాడిపోయెను - బాష్పప్రవాహముచే
మాట డగ్గుత్తికపడె 'అమ్మా!' యటంచు

అనబోకు అనబోకు అమ్మ అంతటిమాట
గుండె నింతింతగా కోసిపెట్టెదచూడు
నను నమ్మవే తల్లి నాజానకీమాత!
వేదాంత పరిపూత విశ్వ మంగళగీత!

నను నమ్మకుంటేను నాతనువుచీల్చెదను
నా తనువులో రామనామామృతము పారు
నను నమ్మకుంటేను నాతనువు త్యజియింతు
ప్రభువునే తనువులో ప్రత్యణువు వినుతింతు!

శ్రీరాము డవ్యయుడు శ్రీరాము డచ్యుతుడు
రాముడే రక్షకుడు రాముడు నిరీక్షకుడు
రామనామము నాదు రక్తాస్థిగతమయ్యె
రామనామస్మరణ ప్రాణవాయువు తల్లి

రోమ రోమము రామ
నామ గానము సేయు
నా దేహ మెట చీల్చి
నా ప్రభువు కన్పించు!

రాముడే స్వయముగా నిచ్చె
రత్నాంగుళీయకము - మంత్ర
రత్నాంగుళీయకము - ప్రేమ
రత్నాంగుళీయకము తనది!

అష్టాక్షరీమంత్ర పూత
శిష్టాంగుళీయకము తల్లి
కష్టాలు తొలగించి నీ యా
భీష్టముల్ నెరవేర్చునమ్మ!

మరిఇదిగో రామనామ ప్రకాశితమైన
ముద్రికను నాకు రాముడుయిచ్చె కైకొమ్మ
అని రత్నముద్రికను తనకొప్పులోనుండి
తీసియిచ్చెను హనుమ ధీరత్వమొప్పగా!

సీతామహాదేవి చిగురుదోసిటను
ఆకులన్ పుష్పవలె అలరె ఉంగరము
మందారపుష్పమున మంచుబిందువుగ
బంగారునగలోన పవడమైతోచె!

పద్మమున కేసరపంక్తిగా తోచె
పచ్చనితొడిమపై పసిమొగ్గవోలె
ముత్తెంపుచిప్పలో ముత్యమ్మువోలె
చిగురుటాకులమధ్య సిరిమల్లెవోలె!

అది అందుకొని సీత ఆనందమంది
తన్మయత్వంబుతో పలవరించినది
సీతమ్మ ఒకసారి చేతముద్రికజూచు
శ్రీముద్రికనుజూచి శ్రీమారుతినిజూచు!

హనుమంతునెమ్మోము కనులార్పకయజూచి
అంగుళీయమువైపు ఆశ్చర్యమునజూచు
పరిపరివిధాలుగా పరికించిమరిచూచె
పరిశీలనముచేసి పరికించిమరిచూచె!

కలకాదుగదఅంచు కన్నులను నులుముకొని
పరిసరమ్ములనెల్ల పరికించిమరిచూచె!

## ఏ హ్మ్రా ఏ పుం

మోదాబ్ధిలో తేలి మూర్ఛలో మునిగి
స్వాగతమ్ముగా పలికె సౌశీల్యమొలుక

"ఓ స్వామి! ఇది యేమి ఊరకున్నావ
ధరణీమండలమెల్ల తగులబెట్టకను
ప్రళయోగ్రమూర్తివై ప్రజ్వరిల్లకను
విలయాంతకుని వోలె విల్లుపట్టకను!"

అనిపల్కు సీతతో అమితహర్షార్చి
గనిహనుమ ఎంతగనో కన్నీరు కార్చె
మతిమంతుడైన హనుమంతుడావేళ
అతియత్నమొనరించి ఆమ్మనోదార్చె!

రాముముద్రిక చూపి రామగాథను తెలిపి
విశ్వాసములు కల్గ వినతుడై ప్రార్థించె
సీతామహాదేవి చెందె ఆమోదమ్ము
ప్రీతితో విప్పారె సీతాముఖాంబుజము!

తప్పిపోయినబిడ్డ తల్లిగన్నంత
ఆనందుడైనట్లు హనుమంతుడనెను
"ఈ అంగుళీయకము ఇనకులాభరణునకు
కరకంకణంబయ్యె కాంతాశిరోమణీ!

నీకారను నాప్రభువు నీరైనముట్టకను
కఠినపాషాణముల్ కరిగినీరౌనట్లు

ధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

పల్లవంబులు చూచి 'పల్లవాధర! ముగ్ధ
ధరణిజమ్ములనెచట దాగియుంటివె' అంచు

ధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

తీవలను తిలకించి 'తీవబోడీ! సీత
తరువీథులందెందు దాగియుంటివె' అంచు

ధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

హంసలను పరికించి 'హంసయానా! కలికి
కలువకొలకులలోన కనుగప్పియుంటె' యని

ధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

మందార మాలతీ మాకందముల కేగి
'మాసీత మీపొదలమాటున దాగెన?' అంచు

ధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

హరిణబాలల గని 'హరిణాక్షి మాసీత
ఎటనున్నదో సుంత ఎరిగింపరే' అంచు

ధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

కలకంఠములఁజూచి 'కలకంఠి నైదేహి!
తరుశాఖలందెచట దాగియుంటి' వటంచు
నీ ధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

ముద్రికనునాకొసగి 'ముగ్ధ మోహనరాజ్ఞి!
ధరణీమూలలనెచట దాగియుంటివె' అంచు
భూధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

మునిమాపువేళలో మునిమానినులజేరి
'మా జానకీబాల ఏజాడనున్నద'ని
బాంధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

'మల్లికా! ఒకమాటు మెల్లగాచల్లగా
సీతనిల్చినచోటు చెప్పు చెప్పవె' అంచు
జన ధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!

'సతతమ్ము నీనీట జలకమ్ములాడేటి
జలజాక్షి మాసీత జాడచెప్పవె' అంచు
నీ ధవుడు విలపించెనమ్మా!
మా ధవుడు విలపించెనమ్మా!"

సీతామహాదేవి చేతమ్ము చెమ్మగిల
కలగాంచిన విధాన కలకదేరియుచూచె
ముద్రికను స్పృశించి మోహానునిగనినట్లు
సంతోషమునపల్కె నాధ్వీలలామంబు!

"ఎంతపనిచేసితివి కాంతిమయి ముద్రికా!
కాంతలెల్లరు మోసకత్తెలనుఅపవాదు
సార్థకముచేసితివి శ్యామసుందరుహస్త
మందారమునువిడిచి మందబుద్ధిగనేడు
ఎంతపనిచేసినావే! ముద్రికా! హా!
చింతామణిని విడిచినావే!

మొదటగా రాఘవుని 'హామ్మహామ్మా' కైక
వెంటనే పురలక్ష్మి విడిపోయెసద్గుణుని
అడవిలో అటుపంపి విడనాడితివి నేడు
విభువైన ప్రియతముని వెతలలోముంచెత్తి
ఎంతపనిచేసినావే! ముద్రికా! హా!
చింతామణిని విడిచినావే!

ప్రేలంటి నీవైన విడనాడకున్నావు
నీవెంతో యోగ్యవని నిను మెచ్చుకున్నానే
చివరకీవును ప్రభువు చే వదలివచ్చితివి
అవునులే! నీ మనసు అతికర్కశముకదా!
ఎంతపనిచేసినావే! ముద్రికా! హా!
చింతామణిని విడిచినావే!

ఉన్నట్లుగానుండి ఒకనొకరి మందిరము
పురుషోత్తముని పెద్దమోసమేచేసితివి
భూమిలో పురుషులను ప్రేమింపరానిదని
సామెతను సార్థకము సల్పినావైనదే
ఎంతపనిచేసినావే ముద్రికా! హా!
చింతామణిని విడిచినావే

నా వివాహమునాడు
నన్నొసంగెడివేళ
శ్రీరామవిభుచేతి
వ్రేలికినితొడిగె నిను!

నన్నెంత ప్రేమించి
మన్నించెనో ప్రియుడు
నిన్నంతగా నిలుపు
కున్నాడె కనులలో!"

అనిముద్రికనుబట్టి కనులనీర్పెట్టుకొను
అంతలో ప్రియునట్లు ఆత్మపైహత్తుకొను
తనుతానె దుస్సహా కృతక్షితాభారమున
కుంచించుకొనిపోయి కూర్చుండిపోయినది!

కన్నీరుమున్నీరుగా ఏడ్చియును వేగ
క్షమియింపవేడినది కనులెత్తిచూచినది
కన్నపుత్రునివోలె గారవముపొంగార
నిష్కళంకంబైన నేత్రాలచూచినది

రామచంద్రులవారి
క్షేమవార్తలుఅడిగి
మరిదిలక్ష్మణు తలచి
మరిమరీ తెలిసికొని

మోదాంబునిధిలోన
మున్గిమూర్ఛిల్లినది
బ్రతుకుపైఆశ అల
నల్ల చిగురెత్తినది!

అనురాగపూర్ణుండు అనుపమోత్సాహుండు
రఘువంశతిలకుండు రాజీవనేత్రుండు

నా ప్రభువు నను మరచినాడా!
విసిగి ఇక నను విడిచినాడా!

నామనోవల్లభుడు నామనస్సంచరుడు
నాజీవనజ్యోతి నాపావనఖ్యాతి

నా ప్రభువు నను మరచినాడా!
విసిగి ఇక నను విడిచినాడా!

కౌముదీసమయాల గౌతమీతీరాల
ఉద్యానవనములలో ఉత్సవంబునుగూర్చి

నా ప్రభువు నను మరచినాడా!
విసిగి ఇక నను విడిచినాడా!

మునిమాపువేళలో శైలదృశ్యాలలో
అందాలు చూపించి ఆనందపరచేటి

నా ప్రభువు నను మరచినాడా!
విసిగి ఇక నను విడిచినాడా!

హంసతతితో ఆడ 'హంసతో నానడకయె
నీనడకలో హంసనడకలున్నవి' అనెడి

నా ప్రభువు నను మరచినాడా!
విసిగి ఇక నను విడిచినాడా!"

అమ్మ ఎన్నింటినో అడిగె
హనుమ అన్నింటినీ చెప్పె
మధుర శ్యామప్రసంగమున
మమత రాత్రియె గడిచిపోయె!

ఆమహాసాధ్వితో హనుమ అన్నాడు
మలయమారుతమటుల మదిహాయినంద
"రఘురామచంద్రుడు లక్ష్మణునితో వచ్చి
రావణుని దునుమాడు దేవతలుకొనియాడ

నీ క్షేమమెరిగింతు నీ మనోనాథునకు
నీవుచెప్పినది విన్పించెదను ప్రభువునకు
సందేహములుతొలగ సౌశీల్యవతి తల్లి!
సందేశమీయవే సౌజన్యవతి తల్లి!"

అని అంజలిఘటించె ఆంజనేయస్వామి
హర్ష బాష్పాంబువుల్ వర్షమైకురియగా
అంతట సీతమ్మ హనుమతోనిట్లనెను
నమ్రతముకలుగంగ నెమ్మనము చెలువొంద

"ఒకనాటిసంజలో ఉల్లాసమున నేను
కనువిందుగావించు వనములోవిహరించి
వివిధ మందారములు విప్పారగా చూచి
ఒడినిండ కోసికొని జడనిండ పెట్టుకొని

ఏటిఒడ్డుకునేగి నీటిలో నాపాప
సొంపులను వంపులను చూచుకొనుచున్నాను
అదిచూచి నాప్రియుడు అల్లంతలోవచ్చి
'పుష్పవతివైనావు ముట్టుకోవలదం'చు

పరిహాసవదనుడై పరువెత్తి దూరముగ
అట్టె చూచుచునుండె అట్టె నవ్వుచునుండె
నాసాథుమాటలో నర్మోక్తిని గ్రహించి
నవ్వుకొని పతితాక రివ్వురివ్వున జనితి!

అందినట్లే నిలిచి అందకుండగపోవు
తానునంతటిలోన తప్పించుకొనిపోవు
ఆగిపోనొకచోట సాగిపోనొకమాటు
చెట్టుచాటుకుజరిగి గట్టుచాటుకునురుకు

అందకుండగనాకు అటుఇటూపరుగెత్తి
నన్ను పరుగెత్తించి నన్నాటపట్టించి
కవ్వించి కవ్వించి నవ్వించి నవ్వించి
ముదమందె నాప్రభువు పొంగిపోయెనుకేమ్ము!

మోదమ్ము ఉప్పొంగి స్వేదమ్ముపైకుబికి
ముత్యాల రూపెత్తి ముంచెత్తెనది నన్ను
నుదుటిపై తిలకమ్ము చెదరికరిగినయపుడు
మునిమాపువేళలో మునివ్రేళ్ళతోనాపు

చుబుకమ్ముపైకెత్తి సూటిగాసరిజూచి
తిలకమ్ము తీర్చిదిద్దినగాథ వినిపించు
నారామచంద్రునకు నారామభద్రునకు
శ్రీరామప్రభువునకు ఆ రామసుందరునకు

ఇంకొక్క సంఘటన స్మృతికితెచ్చెదగాని
వినిపింపు నాపతికి విని నన్నుస్మరియించుచు
ప్రియమార ఒకమారు ప్రియునకై నేను
వలపొలుక పాల్బువ్వ వండిపెట్టితిని

ఒకకాకి కుటిదూరి ఉట్టిలోనున్న
పాలబువ్వను నేలపాలుచేసినది
పలుమార్లు గిన్నెలన్ పడద్రోసి నన్ను
వేధించి విసిగించి బాధించసాగె!

19)

చీకాకుపడి నేను చిన బెడ్డవిసరి
వాయసమ్మును తిట్టి భయపెట్టియుంటి
ఒకనాడు వనములో ఒకమ్రానినీడలో
ఒకపిల్లకాల్వదరి ఒకచల్వరాతిపయి

ఇరువురము బహుగతస్మృతులు మదితలచుకొని
కమ్మతెమ్మెరలందు సొమ్మసిల్లితిమంత-
నాఅంకతలమందు నాప్రియుడు తలపెట్టి
సొగసుగా చూచుచునె సుఖనిద్రలోమునిగె

ఆముఖము చూచుచునె నై మరచిపోయితిని
తామరసనేత్ర సౌందర్య ప్రవాహమ్ము!
సమయమ్ముగని వాయసమువచ్చి పగబూని
నానెత్తి పొడిచినది నాపైటలాగినది!

రవ్వంత కదిలితే రామచంద్రుని నిద్ర
భంగమౌనని యెంచి బాధలోర్చితి బిడ్డ!
అటుఎగిరి ఇటుఎగిరి అటుగీరి ఇటుగీరి
కాయమ్ము వాయసము గాయమ్ము చేసినది

స్వామి మేల్కొనినాడు ఏమిటిది ? అన్నాడు
నేనేమియును చెప్పనేలేదు అయనే
పరిసరము పరికించి మరి తెలిసికొన్నాడు
తెలియక నెట్లుండు దివ్యతేజోనిధికి?

"కాకాసురుడ! ఎంత కండకావరమురా !
కలికిమిన్నలపైన కాల్ దువ్వుచున్నావు
తృణము చాలుర ముప్పుతిప్పలును పెట్టుటకు
నీ బ్రతుకునకు ఇంత నిక్కుటయునీల్గుటా!"

అని గడ్డిపోచొకటి అసురుపై విసిరాడు
వానికది ఓబిడ్డ! ప్రాణాంతకంబయ్యె
రామకోపము కెదిరి రక్షించువారెవరు!
ఈరేడులోకాల ఇక తిరిగివచ్చాడు

ఈరేడులోకాల ఎవరుశేరని తెలిసి
రామపాదాలపై వ్రాలి విలపించాడు
ప్రార్థనలు చేసి చెంపలువేసికొన్నాడు
తెలిసికొని పలుకాకిపని మానుకొన్నాడు

'కావు కావు' మటంచు కాళ్ళపైపడినాడు
కన్నీరుమున్నీరుగా ఏడ్వసాగాడు
'కానిపనిచేసితిని కనులుపోవు' నటంచు
కాకిగోలను చూచి కారుణ్యమయమూర్తి

మానసము ద్రవియించ మన్నించి కరుణించి
ఒకకన్ను మాత్రమ్ము ఒసగి 'కాకాసురా!
ఇకపైన జాగ్రత్త!' అని వదిలిపెట్టాడు
కాకాసురుని విచిత్రగాథ ఇది'' యనిపలికె

''ఇంకొక్కపూటున్న ఎంతబాగుండునో!
నీతోడమాట్లాడ నిండారు సంతసము
ఎంతమాట్లాడినా ఇంకను సశేషమే!
భర్త అభిమతమేమొ భర్గపీఠోద్భవా!''

అను తల్లిమాటలకు అనిలాత్మజుడు 'నల్లె'
యని రావణునిజూడ మనసులో వాంఛించె!

# విజృంభణము

అంతఃపురమ్ములో
అపశకునములు తోచె
ఉద్యానవనములో
ఉత్పాతములు పుట్టె

వృక్షాలు పృథివిపై
విరిగిపడిపోయాయి
చపలంటి పక్షితతి
సంక్షోభ మొనరించె!

రక్షఃపటాలాల
వక్షాలువణికాయి
అతిభయంకరులంత
అతిభీతిచెందిరిక

గుండువంటిదేహముండి
గుండెలేని పిరికిభటులు
బండలందు కొండలందు
పడిపరువెత్తిరి కపిగని!

పరిఘ శూల తోమరాది
పలుఆయుధములు కైకొని
వనరక్షకభటవర్గము
హనుమంతుని చుట్టుచేరె!

వనద్వార తోరణమున
ఘనశ్యామరామభటుడు
సింహాంబులు తత్తరపడ
సింహగర్జనమ్ముజేసె!

'జయము రామలక్ష్మణ శౌర్యసాహసులకు
జయము సుగ్రీవ వానరసైన్యమునకు
రామపాదదాసుడ జగత్ప్రాణసుతుడ
దనుజప్రాణాంతకుడ పేరు 'హనుమ'యండ్రు!

ఎందరెందరువచ్చినా ఎదిరినిలిచి
చెట్లతో రాళ్ళతో పోరుసేయువాడ
లంకపురి పాడుచేసి మాలక్ష్మిసీత
దీనెలుపొంది మాయూరుపోవువాడ!'

కాలమేఘగర్జనముల గగనవీధి తిరిగెహనుమ
వచ్చిన రాక్షసభటులను పరిఘవిసరి సంహరించె
దైత్యచైత్యభవనశిఖరి సత్యమూర్తి హనుమమెరసె
ప్రళయారుణకిరణుడైన ప్రచండమార్తాండునివలె!

ప్రమదవనపాలకులు రయమునన్ జనుదెంచి
పర్వతాకారుడౌ వానరుని వీక్షించి
రుద్రవీరోద్భవుని రోచిస్సు కనుచెదర
వెరగంది పరువెత్తి విన్నవించిరి పతికి!

ముల్లోకములనెల్ల ముప్పతిప్పలుపెట్టు
అసురేశ్వరునకునిది అవమానమనిపించె
అతివేగమున సేననంతటిని దూకించె
ఆర్తనాదాలెల్ల అల్లుకొనె అగ్నివలె!

ప్రాకారములు ప్రీలి ప్రాసాదములు నేల
మట్టమ్ముగాకూలి మండుచుండెను ప్రోలు
ఎందరో ఎందరో ఏడ్చుచుండిరి స్త్రీలు
వచ్చుచుండిరి వచ్చి చచ్చుచుండిరి భటులు

వీని ఉత్తేజమ్ము వీని ఉత్సాహమ్ము
పృథివిలోచూడగా ఎవరికిని సరిరావు
ఒకడె పెక్కుగతోచు ఒకడె అంతటతోచు
ప్రళయాగ్ని రుద్రుడో ద్వాదశాదిత్యుడో!

అని సంభ్రమాశ్చర్య హాహారవాలతో
మరణభీతిని చెంది పరువెత్తిరసురులు
ఒకసారి వామనుడు, ఒకపరి త్రివిక్రముడు
పావకుడు, ఒకకోతి పలువిధాలనిపించు!

హనుమ సంతోషమ్ము ఇంతింతఅనలేము
కపినేత మోములో కాంతికంతము లేదు
దశకంఠునకు రామదాసుధ్య మెరిగించి
ఒకసారి అసురసైనికశక్తి గననెంచె!

జంబుమాలిరథియై దంబుమీర బాణమ్ములు
మీదవేయుచుండ హనుమ ఒక్కబండఎత్తివేసె
ముగ్గరమున జంబుమాలి నుగ్గయిపిండయిపోయెను
పనికిమాలిపోయినాడు హనుమచేతి రాయిచేత

రాక్షసబలగమ్ములు తమప్రాణమ్ముల రక్షణకై
పరుగిడిపోయిరి తమములు అరుణకాంతికరిగినటుల!
సేనానులు వచ్చివచ్చి బాణాలను రువ్విరువ్వి
మానాలను విడువలేక ప్రాణాలనువిడిచినారు!

మంత్రుల పుత్రులు మిత్రులు మారణాయుధాలతో స
మీరణాత్మ సుతునిపైకి దారుణముగ వచ్చిపడిరి
మంత్రిపుత్రులేవురు రణతంత్ర నిపుణులొక్కసారి
జడితుఫాను జల్లువోలె వడివడి తూపులువేసిరి

గాలిమొగుల తోలినటుల వాయుసుతుడు వారిని మరి
తన్నిగ్రుద్ది మన్నుగరపి దండధరుని జేరపంపె

దుర్ధరుడు వస్తూనె దోస్ఫాలనముచేసి
కాలకాదంబినులు కవ్వించి కురిపించు
అశని సంఘాలట్లు అతిభయంకరమైన
బాణాలు కురిపించె ప్రాణాలు హరియించ

ఒక్కదెబ్బ విసిరతని ఉసురులను గైకొనెను
విజయకాంతులుతోడ వేరొక్క సూర్యుడై
తోరణము నెక్కి గంభీరముగ ప్రకటించె
'ఆంజనేయుడ నేను హరివిధేయుడనేను

శుభకరుడ వాయుజుడ సుగ్రీవ సచివుడను
శ్రీరామ దూతనై సీతజాడను గనన్
లంకలో జొచ్చితిని పంకజాక్షిని గంటి
అసుర ప్రాణాలతో ఆటలాడుకొనుచుంటి

అసురమరణ కుతూహలముతో పవనజుడు
రత్నతోరణమందు రాజిల్లుచున్నాడు
సేనాగ్రనాయకులు నానాయుధాలతో
ఘోర యుద్ధముచేసి మారణంబైనారు!

దుర్జయుడగు హరినెరుగక దుర్నిరీక్ష వీక్షణముల
అక్షకుమారుడు వచ్చెను లక్షలాది సేనతోడ
సురలు బెదిరిచూడ నరులు అదిరిపోవ
కడలి కలతచెంద పుడమి హడలిపోవ

ఆయుధములులేనివాడు ఆయుధములుగలవారిని
అరచేతుల త్రిప్పిపట్టి అద్భుతముగ అణచివైచె

శరముల రక్తముచిందగ హరిఅనిపించెను ఇనుడై
గర్వాంధునిపై మారుతి ఖర్వసేత్రరుచులబరపె
వీరుడు అక్షకుమారుడు కోరినాడు రంభపొందు
మసిమసి నుసినుసి అయ్యెను మంటబడిన గడ్డివోలె

మాటనెరుగునట్టి మదగజమ్ము మాంద్రి
రణమునబడి దుర్మరణముజెందినాడు
ఇంద్రజిత్తు ప్రచండ హేతిచ్ఛటలతో ప్ర
భంజనాత్మజు తాకి బహువిధంబుల పోరె

అంతుబట్టగలేదు హనుమంతు పటుశక్తి
అస్త్ర శస్త్రము లన్ని వ్యర్థమైపోయినవి

యోచించి యోచించి వ్యూహముల్ రచియించి
వ్యర్థమైపోవగా వ్యథచెంది వ్యథచెంది
బ్రహ్మాస్త్రమును వేసె బహుజాగరూకుడై
బ్రహ్మపై గౌరమున బంధితుడయెను హనుమ!

## రావణ వైభవము

హనుమంతుడస్త్రమును అణగార్చలేదేమి?
కార్యమ్ము తలచెనో? ఘనుల మనసెరుకౌనే?
పవనాత్మజుడు అస్త్రబద్ధుడై బందియై
రాజదర్బారులో రావణుని చూచాడు

దేదీప్యమగు మహాతేజమ్ముతో వెల్గు
రాక్షసేశ్వరుని దర్బారు వీక్షించాడు
రావణుని సంస్థాన ప్రాభవము పరికించి
ఆశ్చర్యపడి 'ఔర' అని ఔడు గరచాడు

ఏమి రూపము ఏమి వీర్యము
ఏమి శౌర్యము ఏమి ధైర్యము
ఏమి తేజము ఏమి ప్రాభవ
మీ మహాసురునిది!

సర్వలక్షణ యుక్తమైనది
సర్వ శాస్త్రాదర్శమైనది
సర్వ యోధ ప్రబలమైనది
సర్వవిధములు గాన్!

భర్మ హర్మ్యము భోగ్యమైనది
నర్మసచివులు మిగుల యోగ్యులు
ధర్మ మొకటి లుప్తమైనది
కర్మ మిటులుండెన్!

సుగుణ మొక్కటి నీనికుండిన
అగణితంబగు సురగణంబులు
పొగడుచుండగ దేవవీరికి
తగినవాడుకదా!

నీవు చేసే ఘాతుకాలకు
పాడితప్పిన ఆగడాలకు
నీవు నీటమునుంగు లేదా
పాడుపడిపోవున్!

అని తలపోసెను మారుతి కనుగొని రావణునిగతి
హనుమంతుని రూపముగని మనమున రావణుడనుకొనె-
"నందీశ్వరుడో హరుడో! సందేహమ్మగుచున్నది
భస్మాసురుడో ఏమో ప్రాణాలకు భయమయ్యెను

మాయవేషమూనినట్టి మార్తాండుడో! హరి గరుడుడో
ఈ వానరుడే భీకర దావానలుడో! జముడో
జాతక మెట్లున్నదో? ఏపాతక మొనరించితినో!"
రాజాజ్ఞ ప్రహస్తుడు ప్రశ్నించెను హనుమంతుని

"నీవెవరివో వివరింపుము నీనామము స్మరియింపుము
ఏదేశము నీదేశము? ఏ భూపతి నీ అధిపతి?
ప్రాణాలకు భయములేదు వానర! కథవివరింపుము
అయదార్థము తెచ్చుముప్పు అంతయు ఇటనిజము చెప్ప!"

# ప్రబోధము

"రావణేశ్వర! రాక్షసరాజమౌళి
జయము సత్యమ్మునకు సర్వసద్గుణులకు
రామపాదదాసుడ! జగత్ ప్రాణసుతుడ
పేరు హనుమంతుడందురు వీరవర్య!

ఆ రాముడు నీతిపరుడు ఆరాముడు ధర్మపరుడు
జనప్రియుడు నా రాముడు సర్వమయుడు నా రాముడు
ఆ రాముడు నా ప్రాణము ఆ రాముడు నామానము
జగతికిగతి నా రాముడు జగదధిపతి నా రాముడు!

ఆ రాముని బంటునేను ఆ రాముని దూతనేను
ఆ రాముని కృపగమ్యము నా రాముని కథ రమ్యము
దశరథరాజకుమారుడు ధర్మమూర్తి దయావార్ధి
కోసలదేశాధీశుడు కౌసల్యా తనూజాతుడు!

మునియజ్ఞము రక్షించెను దనుజతతిని శిక్షించెను
రాతిని నాతిగ జేసెను జ్యోతిని మరి వెలిగించెను
నీకును కదలని ధనువును జోకగ రెండుగవిరిచెను
మహిపయి ధర్మము నిలిపెను గుహుని కౌగిలించుకొనెను!

శబరి విందు నందుకొనెను అబలుల మరి కాపాడెను
కోతికి ఖ్యాతిని గూర్చెను నీతికి ఊపిరిపోసెను
నినుచంకను ఇరికించుక నీరధులన్నిట మునిగిన
వాలిప్రాణ మొక్కకోల లీలతీసినట్టి ఘనుడు!

లోకాలకు సీతమాత నాకేశులకధి దేవత
జనకరాజు ఆత్మమహిత వనితలందు పతివ్రత
ప్రాణికోటి పూజనీయ పరమవేద వర్ణనీయ
ఆమెయెడల అపచారము ఆచరించినావు అసుర!

ఇప్పుడైన సీతనుగొని అప్పగింపు రఘువరునకు
నీతప్పును క్షమియించును నిను రాముడు మన్నించును
అసురత్వము విడిచిపెట్టి అనుచు కనులు 'హరి హరి'యని
శరణంటే రక్షించే కరుణాత్ముడు శ్రీరాముడు!

సజ్జనులను బాధించెడి శత్రుకోటి పరిమార్చగ
దీక్షను గైకొనినవాడు కక్షను గైకొననివాడు
పెంచకు రాముని కోపము ఎంచగ నీకది శాపము
తెంచుము కామక్రోధము వంచుము తల న్యాయము కడ

కామము, క్రోధము మోహము ఏమనిషికి పాడిగావు
చెడిపోవును నడివీధిని పడిపోవును పశువట్టుల
ద్వేష రోష కలుషబుద్ధి దోషమ్ములు చేయించును
అపకీర్తిని తెచ్చిపెట్టు ఉపపత్తికి చిచ్చుపెట్టు

కటువైనను హితుడెప్పుడు పటుహితమును భాషించును
సత్యము రుచించ దెప్పుడు పథ్యము రోగికి మాదిరి
నామాటలు వినకుంటే నీ మృత్యువు నిశ్చయమ్ము
రామవిభుని క్రోధాగ్నిని రగిలించకు రాక్షసపతి!

లంకాపురి భస్మమగును శంకలేదు మాటవినుము
నీవొకని కారణముగ దావాగ్నులు పుట్టుపురివి
జాతకమిట్లున్నది! ఈ పాతకమొచరింపకు ఈ
సీతను పతికడకంపుము ఖ్యాతిగ భువి జీవింపుము!

# ప్రజ్వలనము

ఆంజనేయుని స్నేహోక్తులాలకించి
మండిపడిపోయినాడు దుర్మద విభుండు
అవని పోగాలము సమీపమైనవాడు
వినడు చెవులుంకూడ సజ్జనుసహితము

పవనజు పలుకులు రావణు
చెవులందున ములుకులవలె
ఈటెల పలుపోటులవలె
గాటముగా మదినాటెను !

కుతకుత ఉడికెను దనుజుడు
సతమతమయ్యెను దనుజుడు
ఆలోచన కోల్పోయెను
అవివేకము పైకుబికెను !

కోపమ్మది పెచ్చుపెరిగె
తాపమ్మది రెచ్చిపోయె
నిప్పులురాల్చెను కన్నులు
తప్పొప్పులు బుద్ధిమరచె !

"ఈ వాచాలుని చపలుని
వేవేగము వధియింపుడు"
అనుచు రూక్షవీక్షబరపె
హనుమంతుని దిశవైపుగ

భయమింతయునులేని ఆ ప్ర
భంజన సుతుడు నవ్వి అనెను-

కార్తవీర్యార్జునుని ఎడమ
కాలితాపులు తిన్న త్రేత!
బలిరాజు దాసీలు చేతి
బందియై పడియున్న ప్రోడ!

అంగదుని ఉయ్యాలపైన
ఆటబొమ్మయున్న ఘనుడ!
కపిలముని గ్రుద్దుతో నేల
కరచిన మహాశౌర్యశాలి!

పార్వతి జగన్మాతను చెర
బట్టనెంచిన ఘోరపాపి!
ముగ్ధ వేదవతి మృత్యువుకు
మూలకారణమైన ద్రోహి!

పుట్టుతోబుట్టు నీబుద్ధి
పుడకలన్ బెట్టినాపోదు
కట్టకడపట పోయ్యేఒకటే
కట్టెవంకరతీర్చు మూర్ఖ!

అదివిని గని అదిరి పడెను
అటనున్న విభీషణుండు
హరినిసర్గి సమయమునకు
హరిభక్తుడు పలికె నిటుల-

అది ధర్మము కాదన్నా!
అది నీతియు కాదన్నా
దూతను వధియింప తగదు
నేతను నిర్జింపవలయు

కోతిని వధియించిన మన
ఖ్యాతికి మచ్చ యౌను! రాజ!
కోతిగాని తోక ఏల?
కొట్టి పంపివేయ దగును

రాక్షసు లాలోచించిరి శిక్షింపవలయు నెట్లనీ?
ప్రమథులు ఆలోచించిరి రక్షించుట ఎట్లెట్లని?
'వానరులకు వాలమ్మున వల్లమాలినంత వలపు
దానికాల్చి పొమ్మనుటే తగినదండు వీనికిందు

అప్పుడు తోక ఖండించును అది గుణపాఠంబగు'నని
సచివులెవరొ సూచించిరి సమ్మతించె రావణుండు
సంతోషముతో శ్రీహనుమంతుని వింతగ చూచిరి
తోకకు వస్త్రంబులు అస్తోకముగా పెనవేసిరి

కుంభంబుల తైలంబులు గొనివచ్చిరి కడుచెచ్చెర
వస్త్రంబులు ముంచినారు వాలంబున చుట్టినారు
అంబులు పాశంబులు శూలంబులతో బాధించిరి
ఈటెల పోటులతో చెడు మాటల నవమానించిరి

వానరవరు వాలమునకు దానవులగ్ని రగిల్చిరి
వినకూడని పలుకులనుచు వికటమ్ముగ మరినవ్విరి
పెనుబాధలు కఠినోక్తులు మనసారగ ఓర్చుచుండె
తనదేహము కుంచించును వినువీధికి పెంచుచుండు

తోక ఎంతో పెరుగుచుండె కోకలేమొ చాలకుండె
తైలంబులు కాగుచుండె జ్వాలలు చెలరేగుచుండె
అసురుల శిక్షించితిమని అమిత ముదము చెందినారు
లంకను వీక్షించితినని రామదూత ఎంచినాడు!

21)

లంకాపురి వీథుల సృక్ పంకంబులు నిండిపోయె
కపినాథుని త్రిప్పిత్రిప్పి గంతులువేసిరి అసురులు
తప్పెట్లను వాయించిరి తప్పత్రాగి దొర్లాడిరి
ఖడ్గమ్ములు ఝళిపించిరి కపిరాజును వేధించిరి

శంఖమ్ములు మ్రోయించిరి సరదాలను చేసికొనిరి
విటులవలె తాళ్ళుగట్టి మారుతి నూరేగించిరి
మాతసీత ప్రార్థించెను వీతిహోత్రు మనసారగ
అతిథిక్షేమము గృహస్థు అతిశ్రద్ధగ చూచినటుల

గురువులక్షేమము కొరకై పరితపించి పరితపించి
పరమేశ్వరు నర్థించెడి సరగుణుడగు శిష్యునివలె
కొడుకు రక్షణమ్ము కొరకు బడబాగ్ని ఒడిధరించి
తపనచెంది పరమేశ్వరు ధ్యానించెడి తల్లివోలె

మాతసీత ప్రార్థించెను వీతిహోత్రు మనసారగ
మంచికి ప్రాణము పోయుము మారుతసుతు కావాడుము
పావకుండు చల్లబడెను పావని తనువుకు మాత్రము
మిత్రుని పుత్రుని కొరకై శత్రునిపై వాడి వెడలె !

హనుమంతుని వాలమ్మున పెనుమంటలు మిన్నంటెను
దానవపతి అదృష్టము దారితప్పి అడుగంటెను
మలయానిల మనిపించెను మారుతికి మహాగ్నిశిఖలు
మంచిగంధమ్ముల తోచె మారుతి కామంటలసెగ

పెంచిన దేహమ్మును తగ్గించెను తడవు గమ్మత్తుగ
బిగకట్టిన కట్లన్నియు తెగవడుచై జారిపోయె
ధణధణ జారి పడిన మాతృదాస్య శృంఖులములవోలె
మారుతహతిచే విచ్చిన మబ్బుల గుంపుల మాదిరి !

గ్రహణము విడిచిన రవివలె గుహవీడిన సింహమువలె
దక్షాధ్వర వీరునివలె అక్షరాల ఉగ్రునివలె
శ్రీమంతుడు రుచిమంతుడు ధీమంతుడు హనుమంతుడు
నిద్రలేచినట్టి వీరభద్రునట్లు నిలచినాడు

ఒడలుపెంచి తగ్గించుచు తొడలుచరిచి భయపెట్టుచు
గడియకు నొక రూపమెత్తుచు హాకలగొట్టి అసురపురిని
మరల ఒడలు పెంచిపెంచి తిరుగబడెను దైత్యులపయి
అసురబలము కూల్చివేల్చి అద్భుతములు గావించెను

మండుచున్న వాలముతో మార్తాండునివలె శోభను
దానవపుర సౌధాలకు దావానలములు వీచెను
భవనంబులు కాలుచుండె పవనంబులు వీచుచుండె
అగ్నిరేగి రాజుచుండె అసురబలము కూలుచుండె

మోదుగ విరబూచినట్లు బూరుగ విప్పారినట్లు
కుంకుమ వెదజల్లినట్లు లంకాపురి మండుచుండె
లంకాపురి ద్వారమ్ములు లంఘించెను దుర్గంబులు
మండుచుండె కపివాలము నిండెను దైత్యులకాలము !

లంకాయాగము కొరకై రక్తధ్వజముగ వెలిగెను
భయంకరులు నిశాచరులు భయంపడిరి కోటనిగని
మహాకాళి నాలుకవలె మహారుద్రు నేత్రమువలె
జామదగ్ని పరశువువలె చండసూర్య గోళమువలె

జ్వాలాతోరణమయ్యెను వాలము లంకాపురిపై
హాలాహల విషవిగళిత వ్యాళంబయ్యెను పురిపై
పండెను కిల్బిషజాలము నిండెను ఆయుఃకాలము
మండెను లంకానగరము ఉండె శ్మశానము మాదిరి

"ధణం ధణం ధణధణ ధణ
ధభీలు గుభీ"లనుధ్వనులు
"త్రాహి త్రాహి పాహి పాహి
హాహా" కారాలు రేగ!

వాడవాడ మసియయ్యెను
మేడఒకటి కాలలేదు
అది ఏపుణ్యాత్మునిదో
అతడే దేవుని కాప్తుడో!

బంగారమువంటి లంక
భస్మమండెను క్షణమున
అశాశ్వతాలు కదా ఇహ
ఐశ్వర్యమ్ములు సర్వము!

లంకనుగని హనుమంతుడు
శంకితుడై ఇట్లనుకొనె -
కోపము జయించలేకను
పాపము! లంకను కాల్చితి

పాపాత్ములు పుణ్యులపై
కోపమ్ములు బూనునేమొ!
మాతల్లెట్లున్నదో! అని
సీతమ్మను జూడజనెను!

సీతామహాలక్ష్మి క్షేమంబుగానుండె
చేయెత్తి నుతియించి సీత దీవనలందె!
పుణ్యకాంతలు ఎచట పొల్పార నుందురో
అచ్చోట నెల్లపుడు పచ్చగా నుండుగద!

# పునరాగమనము

అసురలోకంబెల్ల
ఆశ్చర్యపడుచుండ
అమరయక్షాదులు మ
హానంద మందంగ

ఆకాశ మార్గాన
అర్కుడై కనిపించి
తత్తరమ్ములు రేపె
దనుజసంఘములకును

ఆకాశమార్గాన
రాకాసుధాంశుడై
కనువిందు కలిగించె
మనుజ సంఘములకును

ఆకాశ మార్గాన
రాకాసుధాంశుడై
కనువిందు కలిగించె
హనుమంతు డావేళ!

దోబూచు లాడుచును
తోయదమ్ముల నడుమ
వైనతేయుని వోలె
వచ్చుచుండెను హనుమ!

మారుతియు దారిలో మైనాకు మై నిమిరి
ఆదర మ్మొప్పగ ఆనందమును తాల్చె!

మహేంద్రగిరిజూచి
ఓహోహో అనియంచు
హార్షాతిరేకమున
అట్టహాసము చేసె!

సాహితి సమాజమున
స్పందించినట్లుగా
మార్మ్రోగె అధ్వనులు
మాహేంద్ర గిరిగుహాల!

మారుతికి స్వాగతాల్
జేరిపల్కిరి కపులు
బాలరవి రుచులుగని
పద్ములరచినయట్లు!

అంగదాదుల జూచి
అభివాద మొనరించి
ఆనందమున పల్కె
అంబుద ధ్వనివోలె!

చూచితిని జానకిని
చూచితిని లంకలో
క్షేమమ్ముగా యుండె
సీతామహాలక్ష్మి!

రామ ప్రభువు పత్ని శ్యామ సుందరు పత్ని
క్షేమమ్ము క్షేమమ్ము సీతామహాలక్ష్మి!
శ్రీరామచంద్రునకు సీతామనోజ్ఞునకు
జయమంచు శుభమంచు సాధు వాదము చేసె!

# మ ధు వ న ము

మందాకినీ కమల మంజుల తత్వమోదన్
బృందారకుల్ కనులుపెద్దవిచేసి చూడన్
సౌందర్య మందినవి తూర్మతలి పంకజాళుల్
అందాలుచిందె వనమంత లతాంత శోభన్!

మందానిలమ్ములు సుమాల సౌరభంబుల్
నందంబుతోఁగొని వనంబులు పొంగవీచెన్
మందార మద్యమళిమండలి గ్రోలి పాడెన్
కందర్ప గీతములు కమ్మగ ఝుంపె తోడిన్!

చింతామణి ప్రభలు చింద రసాలశాఖా
కాంతల్ వసంత తిలకంబులు దిద్దితీర్చెన్
గొంతెత్తి చూతముల కోకిలమాళవ శ్రీ
కాంతామణి లలితగానము లాలపించెన్!

మోదమ్ముతో లతలు ముద్దుల నటనమాడెన్
నాదమ్ముతో అళులు నాటకురంజి పాడెన్
వాదమ్ముతో శుకము వల్లకి మీటసాగెన్
వేదమ్ముతో పికము వీనులవిందు చేసెన్ !

పున్నాగముల్ సరణిఁసోసెను పూవులోజన్
పన్నీరు చిల్కినవి బంగారు పూలగుత్తుల్
సన్నాయి నూదినవి షట్పద సంచయమ్ముల్
సన్నాహమైనవి వసంత మధూత్సవంబుల్!

పూవుపూవునందు మధువు పొంగిపొంగిపొరలుచుండె
చెట్టుచెట్టులందు తేనె పట్టులెన్నొ పట్టియుండె!

సుందర మందారము

పండుపండు రసముతోడ నిండుకుండలట్టులుండె
కొలనుకొలను మధురసంబు కులికినొలికి నిండియుండె
కొమ్మకొమ్మ పూలతోడ కమ్మకమ్మ గాలితోడ
నెమ్మనమ్ము జారలాడ సమ్మోదము గల్గించును

వనిలో కాచిన మధురఫలంబులు
మనుజులు నోచిన పుణ్యఫలంబులు!
ఎప్పుడు మధువనమ్ము దర్శించిన
అప్పుడు మనసు పొంగులెత్తుచుండు!

మధువనమును జేరి వారు
దధిముఖుగని అదలించిరి
మధుమధుకోహాలు పొంగి
మధుమధువును తెగ త్రాగిరి!

మధూత్సవము చేసికొనిరి
మహానంద మందుకొనిరి
వనము పాడుచేసినారు
వనపాలుర మోదినారు

సరసోక్తుల నాడుకొనిరి
అరచిఅరచి పాడుకొనిరి
సరదాగా గ్రుద్దుకొనిరి
పరుగులెత్తి తన్నుకొనిరి

జబ్బలపయి దెబ్బలుపడి
అబ్బబ్బా! యని పర్విరి
వారుపడ్చి పరువులెత్తె
వీరొకటే నవ్వునవ్వు!!

ఒకరిచేత తేనెనొకరు
ఉరికివచ్చి నాకినారు
ఒకరు కూరుచున్నకొమ్మ
నొకరు ఊపి పడవేసిరి

వనపాలురు పారిపోయి
వినిపించిరి జరిగినపని
వనపాలుర ప్రార్థనవిని
అనుకొనె సుగ్రీవ విభుడు

"మనవారలు ధీమంతులు
గుణవంతులు శ్రీమంతులు
ఘనకార్యము సలిపికొని
వనమున జొరబడియుందరు

సుగ్రీవుడు మధువనమును
జొచ్చిచూచి విషయమెరిగి
అమితానందము చెందియు
అచటందరి నాదరించె

అంగదాదులరిగి వేగ
అతిభక్తిని ప్రకటించిరి
హనుమంతుడు కరమునెత్తి
మనవిచేసె యాత్రనంత!

"సుగ్రీవ కపిరాజ! శుభమస్తు! శుభమస్తు!
సీతామహాలక్ష్మి క్షేమమ్ము క్షేమమ్ము!
చూచితిని జానకిని చూచితిని లంకలో
క్షేమమ్ము క్షేమమ్ము సీతామహాసాధ్వి!

22)

# చూడామణి ప్రదానము

రామచంద్ర ప్రభువుని దర్శనము చేసి
స్వామి చరణారవింద సంస్పర్శచేత
పూతమైనట్టి మట్టినిముట్టి కనుల
కద్దుకొని పల్కె భక్తితో అనిలజుండు-

శుభము శుభము జయము జయము చూచినాను సీతమ్మను
రావణ రాజ్యములోపల ప్రాణమ్ములతో ఉన్నది
చూడామణి అమ్మయిచ్చె చూడుడు ఇదిగో! స్వామీ!
రాక్షసజన మధ్యమ్మున రామా! సీతమ్మ యుండె!

మబ్బుల నెలబాలునివలె మంచులోని పద్మమువలె
బంధితయగు హరిణమువలె బానిస యగు దీనునివలె
ఏకవేణి దీనురాలు లోకమాత భూమిశయన
పడియుండెను చెట్టునీడ పడుచుండెను యమయాతన!

కాకుల కోకిలవలె చీకటిలో పవడమువలె
రాక్షసజన మధ్యమ్మున రామా! సీతమ్మ యుండె
నీకోసము జీవించును నీనామము జపియించును
నిన్నుతలచి నెమ్మనమున సొమ్మసిల్లిపడియుండెను

బాధలు పడలేక జనని ప్రాణము విడ నిశ్చయించె
అంతలోన నన్నుజూచి ఆపె తత్ప్రయత్నమును
నీ బంటని తెలిసికొనెను నిన్నుమదిని మెచ్చుకొనెను
నీకథ మరిమరి విని కన్నీరు కార్చెనయ్యా! జనని

సౌమిత్రికి చిహ్నమ్ముగ నీకేమో గుర్తుచేసె
కాకాసురగాథ; సర్వలోకాధిపు అతిప్రేమను!
చెమటకు తిలకముజారిన శృంగారముగా మణిశిల
నుదుటి పైన దిద్దితిరట అది వినిపింపుమటన్నది!

ఆ రాక్షస హింసలలో ఆ వాసములో బ్రతుకుట
దుర్భరమని వాక్రుచ్చెను దుఃఖించెను అమ్మసీత!
పాత్రాపాత్రత ఎరుగని శత్రువులాపై దనుజులు
ఎంతబాధ పెట్టినారో కాంతకు ప్రాణాంతకముగ!

కన్నీరు కార్చె కలకంఠి సీత
కంటికి మంటికి ఏకధారగా
ఆనీరు మున్నీరుగాగ పొంగి
అసురపురమ్ము ముంచివైవనుండె!

సీత బాధ వినజాలక శ్రీరాముడు మూర్ఛిల్లెను!
శిరోమణిని గనినంతనె శ్రీరాముడు వివశుడయ్యె
సీతను గనినట్టుల మది శ్రీరాముడు భావించెను!
సీత శిరము తాకినట్లు శ్రీరాముడు పరవశించె

పెండ్లివేళ జనకరాజు ప్రియపుత్రికి నిచ్చినట్టి
రుచిర శిరోభూషణమిది ప్రచురమైన కీర్తి కలది
దేవేంద్రుడు కానుకగా దీనిని జనకున కిచ్చెను
ఈమణి ఘనచూడామణి ఈమణి రామహృదయమణి!

కరిని బ్రోవవచ్చు విష్ణు
నురములోని ప్రేమవోలె
రామునిమది జనె జానకి
రామామణి యున్న వనికి!

# నివేదనము

శ్రీ హనుమంతుడు పలికెను చెవులకు విందొనగూర్చుచ
రోగికి ఔషధమట్టుల త్యాగికి లక్ష్యసిద్ధివలె
శ్రీ రామప్రభు! సీతమ్మ చెప్పినసంగతి చెప్పెద
హృదయము విప్పి చెప్పినది సదయుని నిను తలచెనుహృది

ఉభయులము ఒకచోట ఊసులాడేవేళ
భద్రమ్ముగా ప్రభువు నిద్రపోయేవేళ
వాయసము ననుజూచి పరిహాసమొనరించె
మేల్కాంచి తృణమొకటి మేలమ్ముగా విసిరి

కాకాసురుని మహా గర్వమణచిన ప్రభువు
ఇప్పుడెట్లు పేక్షించినాడో! ఇంతలోనను మరచినాడో!
నా మరది లక్ష్మన్న నా బిడ్డ లక్ష్మన్న
నన్నుమరచేవాడు కాడే ! నన్నువిడిచేవాడు కాడే !

నాపాప కర్మమ్ము నన్నిట్లు చేసినది
లేకుంటే వారలకు బిడ్డా! ప్రేమ లేకుండునా బిడ్డా !
విధివ్రాత అని తల్లి విలవిలా విలపించె
బొలబొలా దుఃఖించె కన్నుల జలజలా ప్రవహించె జలము

అపుడునేను పల్కినాను అమ్మా! అట్లు అనకూడదు
ప్రభువుల అనుమానించకు పరమ దయాశాలురమ్మా !
నీ ప్రభువు విరహమున నిశ్చేష్టుడైనాడు - ఓతల్లి !
'సీత!సీతా'! యంచు చిక్కి సగమైనాడె అమ్మా! మాతల్లి !

అంగుళీయము స్వామి హస్తకంకణ మాయెనే
అక్షియుగ్మము కవోష్ణాశ్రుపూరంబాయెనే !
యోధుడగు లక్ష్మణుడు బాధపడుచున్నాడు
వీరుండు నీ కొరకు విలపించుచున్నాడు !

అన్న కష్టము తలచి అన్నమే విడినాడు
నిద్రయన్నది లేక నీరసిల్లెను మరది
నీజాడ తెలియక నిన్ వెతకి వేసారి
ఇంతకాలముపరకు ఎటులెటులోనున్నారు !

ఇప్పుడిక చింతించ నేలనే మాతల్లి!
మాయకష్టములన్ని మటుమాయమైపోవు
రామచంద్రుడు వచ్చి రావణుని పరిమార్చి
నిను అయోధ్యకు తీసికొనిపోవునే వేగ !

ఆనవాలీయమని అడుగగా ఆయమ్మ
తలలోని మణితీసి తగనిచ్చినది తండ్రి!
మీకు సుగ్రీవ స్వామిత్రులకు మనసార
అభినందన మొనర్చి అడిగినానని చెప్పి-

హర్ష ధారల నిల్చి అమ్మతో అన్నాను
అది తప్పొ మరి ఒప్పొ అనిపించలేదపుడు
"నావీపుపైనెక్కి నీవు కూర్చోతల్లి !
క్షణములో రామవిభు సన్నిధిని చేర్చెదను

ఆమాటలకు అమ్మ ఆనంద మొంది అనె-
"అట్లు కాదులె బిడ్డ! ఆర్య పుత్రులనడుగు
ఈ కష్టములు అంతరించెడి ఉపాయమ్ము
ఎంత త్వరలోన సాధించెదవొ మారుతీ !

రాక్షసాంతము చేసి రాఘవుడు ననుగొనుట
లోకకళ్యాణమ్ము లోకులకు ఒకవెల్గు"
అపుడె నేనన్నాను "అంతయును సిద్ధమే
వానరులు వచ్చెదరు దానవులు చచ్చెదరు !

సుగ్రీవునాజ్ఞగా శూరులు నడుస్తారు
శత్రుసంహారమ్ము సత్వరము చేస్తారు"
అని ధైర్యమునుచెప్పి అనిచేసెదరటంచు
అమ్మ దీవెనలంది అరుదెంచితిని తండ్రి !

శ్రీరామ శ్రీరామ ! శ్రితజనమందార !
రామభద్రా జయము ! రామచంద్రా జయము !
నీగాథలో ఒక్కగుణము నియమమున పాటించువాడు
అఖిలసౌఖ్యములందు జగతి నిఖిలుడై పొలుపొందుగతి !

సీతారామ పదారవిందములు
సంసేవించి దుష్కాల జీ
మూతవ్రాతము పుణ్యమారుతముచే
పోద్రోలి సర్వప్రజల్
చేతఃప్రీతినిపొంది సౌఖ్యములతో
జీవింపగా జేయవే!
జాతీయోజ్వల రామజీవనకథా
సల్లాపముల్ సేయుచున్ !

# పట్టాభిషేకము

హనుమంతుని వార్తతోడ
హరివర్గము యోచించెను
ఆహవ మొనరించుటకై
వ్యూహమ్ములు రచియించెను !

సుగ్రీవాజ్ఞకు లోబడి
శూరులు లంకకు నడిచిరి
దనుజుల తలపట్టి ఈడ్చి
తునుమాడిరి పట్టితన్ని !

రాముడు కోదండముతో
రావణవధ గావించెను !
వినయశీలి విభీషణుని
విభునిచేసె శ్రీలంకకు !

సీతను గైకొని శ్రీరాముడు
ప్రీతిపొంది విఖ్యాతినంది
అనుజ మిత్ర పరివారమ్ముల
అంబుధిదాటెను పుష్పకమున !

మునిఆతిథ్యము గ్రహియించెను
హనుమ నయోధ్యకు పంపించెను
భరతుడు కడు సంతోషించెను
పురమంతయు ఆనందించెను !

పుష్యమి నక్షత్రమ్మున
పురములోన ప్రవేశించె
కన్నులపండువు కాగా
వెన్నెలదొర వచ్చినట్లు

శ్రీరాముడు గుణధాముడు
సీతాలక్ష్మణులతోడ!
పలికినారు స్వాగతములు
పౌరులెల్ల రైక్యమ్ముగ!

పాదుకలను తెచ్చితొడిగె
భరతు డన్న పాదములకు
అర్హమైన పద్ధతిలో
ఆప్యాయత పొంగిపోవ!

ఆదరించె రామవిభుడు
అభినందన పూర్వకముగ
ఆనందము డెందమ్మున
అంభోనిధివలె పొంగగ!

ప్రతిఒకరిని క్షేమమడిగి
పరామర్శ చేసినాడు
సుఖదాయక నాయకుండు
సుజన మనోమందిరుండు!

వేల్పులు తనకొసగినపని
వేగిరమ్ము పూర్తిచేసె
లోకులు మరి ఏమన్నను
కైక మనసు తేలికయ్యె!

కైకహృదయ మెరిగినట్టి
లోకనేత సంతసించె
రామునకు నమస్కరించి
ప్రార్థించెను భరతుండట -

"మాఅమ్మను గౌరవించినావయ్యా !
మాఅమ్మమాట పాలించితివయ్యా!
ఈరాజ్యము నాకెటులిచ్చితివో
ఇచ్చుచుంటి నీకై నీరాజ్యమును !

ఏలుకోమ్మా అన్నయ్యా!
మేలుకలుగు లోకములకు"
ఆ మాటల కానందము
అందెను శ్రీరామవిభుడు !

లోకానికి కల్యాణంబయ్యెను
శోకానికి చరమాంకంబయ్యెను!

"మేమందరమును స్వామీ!
మీ భృత్యులమేనయ్యా!
మమ్మందరి రక్షించే
మహారాజు వీవయ్యా !

ఆచంద్రము రామచంద్ర
అధిపతి వీవేనయ్యా!
కాలచక్ర మాగువరకు
ఏలిక నీవేనయ్యా!"

23)

భరత విన్నపమ్ము వినెను
పరమముదము చెందె మనము
రామమూర్తి రాజయ్యెను
ప్రజలకష్ట మంతమయ్యె!

పట్టమ్మును కట్టె జనము
పట్టరాని ముదమ్ము పొందె
ప్రజలందరి చిత్తమందు
పరమప్రీతి చిందులాడె!

రామనామ మణి దీపము
ప్రజలనాల్క పైన వెలిగె
బాహ్యాభ్యంతరములలో
పాపపుచీకట్లు తొలిగె!

రత్నాసనమున రాముడు
రమణితోడ రాజిల్లెను
లక్ష్మితోడ గరుడునిపై
రంజిల్లెడు విష్ణువట్లు!

"యువరాజుగ లక్ష్మణ! కూ
ర్చుండుము" అనె శ్రీరాముడు
లక్ష్మణుండు అప్పుడనె-వి
లక్షణమగు పద్ధతిలో-

"నీ సేవకు ఆ పదవెందుకు
నీ సేవకుడను పదమె చాలు!
భరతుడు యువరాజుగ తగు
భక్తుడు స్థిరసంకల్పుడు!"

అతిబలవంతముపై
అంగీకరించె భరతుడు
భవనములో వనవాస
వ్రతము జరిపిన సుచరితుడు!

'పదవికొరకు ప్రాకులాడు
వాడు లేడు వీరిలోన
అన్నదమ్ము లిట్లుండాల'ని
అనుకొనె సుగ్రీవుడు

అడిగినవారికి అడుగనివారికి
అంతరంగ మెరిగి ఇచ్చె భూపతి
నవరత్నమ్ములు నవఖండమ్ములు
నవనిధులను కానుకగ ప్రతినిధులకు!

మణులను దానమిచ్చి బ్రా
హ్మణులను సన్మానించెను
హారము లొసగెను సుఫలా
హారమ్ములతో ప్రీతిగ!

ఆ ఉత్సవ సమయమ్మున
అమ్మయిచ్చె అనిలజునకు
ఎంచి ఎంచి విలువైనది
మంచి ముత్యముల దండను !

"రామరస విహీనమైన
రత్నమ్ముల పనియేమిటి?
ముత్యమ్ముల విలువేమిటి?
సత్యజ్ఞానమ్ము నిమ్ము

అమ్మా!" అని అంజలించు
హనుమంతుని మెచ్చుకొనెను
అమ్మలగన్నమ్మ సీత
నెమ్మనమ్ము సంతసింప!

సీతారాములు ప్రజలను
సుతులవోలిక గనసాగిరి
కార్యకర్తలెల్లను తమ
కర్తవ్యము పాలించిరి!

ధర్మము నాల్గుపాదముల
ధరణిపైన నడువసాగె
సమతా మమతామయులై
జనులెల్లరు సుఖమందిరి!

కోతికూడ ప్రవర్తించె
నీతితోడ ఖ్యాతితోడ
రామామణి ఏ ఒక్కతె
రాయిగ పడియుండలేదు!

తండ్రిముందు కొడుకెక్కడ
తనువును చాలించలేదు
ఒక్కనికైన అన్యాయము
ఎక్కడనూ కలుగలేదు!

ప్రజలమాట కచ్చోటను
ప్రబలమైన విలువకలదు
ప్రజలచేత ప్రజలకొరకు
పరిపాలన సాగుచుండు!

రాజు కేవలమ్ము కార్యదర్శి
రాజు సంఘానికి మార్గదర్శి
రాజు స్వారాజ్యపు కార్యకర్త
భూమీకాంతకు ఆతడు భర్త!

సత్యము ప్రేమము త్యాగము
నిత్యము వర్ధిల్లు నచట
ప్రజలో ఆర్థిక సాంఘిక
పరిధుల భేదమ్ము లేదు!

దైవిక భౌతిక బాధలు
తగలవు అచ్చటిజనులకు
క్రమశిక్షణ తప్పరెవరు
భ్రమలో పడిపోరెవ్వరు!

సహకారము సద్భావన
జనులందున నెలకొన్నవి
ఒకరికొరకు మరియొక్కరు
ఉన్నదంత అర్పింతురు!

ఆ రాజ్యములో నెచటను
అంతఃకలహాలు లేవు
అన్నదమ్ములందు గలదు
అంతులేని ఆప్యాయత!

ఆరోగ్యము సౌభాగ్యము
ఆ రాజ్యములో అధికము
అందు బాటులో ఉన్నవి
అందరి కన్ని సౌఖ్యములు!

దారిద్ర్యము దుర్బుద్ధియు
దాగికూడ ఉండవచట
ద్వేషరోష కామమోహ
దోషమ్ములు కానరావు!

కాసులకై గడ్డికరచువాడు లేడు
పీసమంత మోసమన్న మాట లేదు!
రాజుఅవసరమ్ము లేదేమొ
ప్రజలుదారి తప్పరెప్పుడును!

జనకల్యాణము లక్ష్యమ్ముగ
జనులందరు యుందురు కమ్మగ
మనుజుల దండించేపనేలేదు
మతముల ఖండించే పనేలేదు!

దొంగ పేరుకైనలేదు
దోపిడీ అసలేలేదు
పరుల ధనముచూచి ఈర్ష్య
పడెడువాడు నెవడులేడు!

మందుడొక్కడైన
మందుకైన లేడు
అందరు ధీమంతులె
అందరు సౌందులె!

కర్తవ్యము మరచిపోరు
కార్పణ్యము తలపబోరు
అందరు సంయములే
అందరు సత్ పురుషులె!

ధర్మము తప్పినవారు లేరు
మర్మము తెలియనివారు లేరు
కర్మము విడిచినవారు లేరు
ఘర్మము నోడ్చనివారు లేరు!

సౌభ్రాత్రము సౌజన్యము
సౌశీల్యము సౌహార్దము
జాజిపూల తీవలట్లు
మోజుతీర అల్లుకొనెను

కర్మిణ్యులు బ్రహ్మణ్యులు
ధర్మవిదు లాపౌరులు
త్యాగధనులు మానధనులు
తపోధనులు ప్రవర్ధనులు !

ఆరాజ్యము ఆదర్శము
అన్నికాలమ్ముల యందున
ఆరాజే మార్గదర్శి
అన్ని దేశముల యందున

మీరాజ్యము పద్ధతిపయి
మారాజ్యము సాగునట్లు మానసదీప్తిన్
మారాజ్యములో ప్రజలను
శ్రీరాముడు దిద్దునట్లు చెప్పవె సీతా!

# మంగళం శ్రీ హనూమతే!

దివ్య మంగళదేహాయ
పీతాంబర ధరాయచ
తప్తకాంచన వర్ణాయ
మంగళం శ్రీ హనూమతే!

భక్తరక్షణ శీలాయ
జానకీ శోక హారిణే
జ్వలత్ పావక నేత్రాయ
మంగళం శ్రీ హనూమతే!

పంపాతీర విహారాయ
సౌమిత్రి ప్రాణదాయినే
సృష్టేః కారణభూతాయ
మంగళం శ్రీ హనూమతే!!